LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.zaminryot.com "e-mail : editor@zaminryot.com"

# జమీన్‌రైతు



స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 28 | 14.7.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి : రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి

# తెలుగు తమ్ముళ్లపై అలుక!

ఎంత ప్రయత్నించినా విద్యుత్ సమస్య ముఖ్యమంత్రిని చికాకు పరుస్తూనే వుంది, తల నొప్పిగా తయారయ్యింది. సిపిఎం, కాంగ్రెస్ పార్టీలు ఏ మాత్రం తమ ఉద్యమ ఉధృతిని తగ్గించడం లేదు. పైపెచ్చు రోజు రోజుకి నానుమడింప చేస్తున్నారు.

కేవలం కాంగ్రెస్ మాత్రమే వుద్యమం నడిపి వుంటే ఈపాటికి సద్దుమణిగి పోయి వుండేదనడం వాస్తవం. సిపిఎం పార్టీ దీన్ని ప్రతిష్టాత్మకంగా తీసుకోవడంతో ప్రతి దినం రాష్ట్రంలో ఎక్కడో ఒక చోట వీధి పోరాటం తప్పడం లేదు. పార్టీ ఉనికి లేని విజయనగరం వంటి చోట్ల కూడా, కేవలం నలుగురు కార్యకర్తలు, విద్యుత్ అధికారుల సమావేశాన్ని ఆటంకపరచి పత్రికలకు సంచలన వార్తలు సృష్టించారు. కార్యకర్తలు తక్కువ కావడంతో, పోలీసులు అతికి పోయి వారిని మీద మీద నుంచి క్రింద పడవేశారు; దాంతో ఆ సంఘటనకు రాష్ట్ర వ్యాప్త ప్రచారం లభించింది. తిరుపతి దుర్ఘటన కూడా అంతే ముఖ్యమంత్రి కారును అడ్డగించడానికి ప్రయత్నించిన కార్యకర్తల పట్ల పోలీసుల ప్రవర్తన అన్ని పార్టీల నుంచి విమర్శలకు దారితీసింది. గతంలో విజయవాడ పోలీసులు అదుపు తప్పి, మహిళలను కొట్టినప్పుడు ముఖ్యమంత్రి పోలీసులను తప్పు పట్టాడు. కాని, ముఖ్యమంత్రి అట్లా మాట్లాడితే పోలీసులలో ఆత్మస్థైర్యం క్షీణించి, ఇతర చోట్ల ఉద్యమకారుల పట్ల ఉదాసీనంగా వ్యవహరిస్తారని ఉన్నతాధికార్లు హెచ్చరించడంతో, తిరుపతి సంఘటనలో పోలీసుల తప్పును సమర్థించారు చంద్రబాబు. అయితే ఆ ప్రకటన సాధారణ ప్రజానీకానికి ఎబ్బెట్టుగా కన్పించింది. అక్రమంగా పోలీసులు ఉద్యమకారులను కొట్టడం ఏ ప్రజలు సమర్థిస్తారు? అటు మాట్లాడితే పోలీసులకు కష్టం, ఇటు మాట్లాడితే ప్రజలకు కోపం రావడంతో పాపం ముఖ్యమంత్రి తల పట్టుకున్నారు. ఆ అయోమయంలోనే ఆయన ఉద్యమానికి పత్రికలు అనవసరంగా ప్రచారం ఇస్తున్నాయని, పత్రికలు పాజిటివ్ ధోరణిలో వార్తలు వ్రాయాలని వ్యాఖ్యానించారు. దానితో పత్రికా రంగం నిరసన మొదలు పెట్టింది.

> **తాను చెప్పినా ఎవ్వరూ కరెంటు ఉద్యమాన్ని నిరోధించడం లేదని నామినేటెడ్ పదవుల పంపకం నిలిపివేశాడు చంద్రబాబు.**

రాజకీయ నాయకుల నుంచి వార్తలు ఎట్లా వ్రాయాలో నేర్చుకోవల్సిన దుర్గతి పత్రికలకు పట్టలేదని, ఈ వ్యాఖ్య పత్రికా స్వేచ్ఛను హరించే ఫాసిస్టు ధోరణికి ప్రతీక అని విమర్శలు తలెత్తాయి. వాటికి సమాధానం చెప్పుకోవడం మరొక సమస్య అయ్యింది చంద్రబాబు గారికి.

మొత్తం మీద విద్యుత్ సమస్య మెడకు చుట్టుకున్న పాములాగ అయన్ను వదలి పెట్టడం లేదు. నిరసన ఉద్యమం ఇంత కాలం కొనసాగుతుందని ఆయన వూహించలేదు. దీన్ని ఇట్లానే అనుమతిస్తే రాజకీయంగా ప్రమాదం; అట్లని ఛార్జీలు తగ్గించడానికి మనసు ఒప్పుకోవడం లేదు. నలిగిపోతున్నారు.

పార్టీ పరంగా ఈ విషయంలో తనకు మద్దతు లభించడం లేదన్నది చంద్రబాబు ఆవేదన. ఎమ్మెల్యేలు ఈ విషయంలో పట్టీ పట్టనట్లు వుంటున్నారని ఆయన బాధ. తెలుగుదేశం పార్టీ యంత్రాంగం సమిష్టిగా కదిలి, ప్రజలలోకి వెళ్లి, ధరల పెంపకంపై ప్రచారం నిర్వహిస్తే, ఉద్యమం పట్ల ప్రజలు స్పందించడం మానుకుంటారని చంద్రబాబు అభిప్రాయం. కాని ఒక్క ఎమ్మెల్యే కూడా అందుకు పూనుకోవడం లేదు. మంత్రులు మాత్రం గెస్ట్ హౌస్‌లలో కూర్చొని పత్రికా ప్రకటనలు చేసి సరిపెడుతున్నారు. వారు మాత్రం ఏమి చేస్తారు? బహిరంగ సమావేశాలు, సభలకు వెళ్తే, ఎప్పుడు ఏ మూల నుంచో ఉద్యమకారులు వచ్చి అడ్డగిస్తారనే భయం వారిలో వుంది. అటువంటి ఇబ్బందికర పరిస్థితులలో ఇరుక్కోవడం కంటే, ఈ సమస్య పరిష్కారమయ్యే వరకు వీధులకు దూరంగా వుండడం మంచిదన్నది వారి అభిప్రాయం.

ఎమ్మెల్యేలు, ఇతర పార్టీ నేతల నుంచి తగిన సహకారం ఎదురుకాక పోవడంతో, ముఖ్యమంత్రి నామినేటెడ్ పదవుల పందారం కార్యక్రమాన్ని నిరవధికంగా వాయిదా వేశారు. ఈ పదవులు ఇస్తామని చెప్పైనా పార్టీ నేతలు ప్రజలలోకి వెళ్తారని ఆశ పడ్డారాయన. అయితే పదవుల కోసం నేతలందరూ వూళ్లు వదిలేసి హైదరాబాద్‌కు పరుగులు పెట్టారు తప్ప, ఒక్కరు తాను అనుకున్నట్లు ప్రవర్తించలేదు. దానితో వీరికి పదవులు ఇవ్వడం దండగ అనే నిశ్చయానికి వచ్చేశారు ముఖ్యమంత్రి. ఆషాఢ మాసంలో మంచిరోజులు లేవని కుంటి సాకు చెప్పి, రాజధానిలో మకాం పెట్టిన నేతలందరూ తిరిగి వెళ్లిపోయే పరిస్థితి కల్పించాడు.

సిపిఎం, కాంగ్రెస్ పార్టీలు కలిసి తెలుగుదేశం ఎమ్మెల్యేల ఇళ్ల దగ్గర ధర్నాలు చేసే కార్యక్రమం ప్రారంభిస్తున్నాయి. ఎమ్మెల్యేలకు వినతి పత్రాలు ఇవ్వాలన్నది వారి ఉద్దేశ్యం. అయితే అందరు ఎమ్మెల్యేల ఇళ్ల దగ్గర పోలీసు బందోబస్తు చేయడం అసాధ్యం. పైగా ఎమ్మెల్యేలు ఎప్పుడు పడితే అప్పుడు, ఎక్కడ పడితే అక్కడ తిరుగుతుంటారు. వారిని ఉద్యమకారులు ఎప్పుడు అడ్డగిస్తారో, ఎక్కడ అడ్డగిస్తారో ముందుగా వూహించడం కష్టం. జనం చుట్టుముట్టి, ఛార్జీలు పెంచడం అన్యాయమని తెలుగుదేశం ఎమ్మెల్యేల చేత నినాదాలు చేయిస్తే, అది ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెడుతుంది. జనం పైన పడినప్పుడు వారు చెప్పినట్లు వినక తప్పదు ఎమ్మెల్యేలకు. ఈ విషయాన్ని ఎదుర్కోవడం ఎట్లా అన్న విషయంలో తెలుగుదేశం నాయకులు, పోలీసులు కూడా సతమత మౌతున్నారు.

ఇంకొక ప్రక్క అసెంబ్లీ సమావేశాలు జరిపించవల్సిన సమయం దగ్గర పడుతున్నది. అసెంబ్లీలో ధరల పెరుగుదలను వ్యతిరేకిస్తామని బిజెపి పార్టీ ప్రకటించింది. అంటే, అసెంబ్లీలో పల తెలుగుదేశం ఒంటరి కాబోతున్నదన్న మాట. ఆ సమయం లోపల ఈ సమస్యకు ఒక పరిష్కారం ఎదుర్కోవాలన్నది చంద్రబాబు ప్రయత్నం. అందుకు ఆయన ఏమి చేయనున్నాడో వేచి చూడవలసిందే. *

## ఊహ నిజమైంది!

ప్రార్థనా స్థలాలలో బాంబులు పేల్చడం ద్వారా అరాచకం సృష్టించడానికి ప్రయత్నిస్తున్న ముఠాకు కేంద్ర స్థానం విజయవాడ కావచ్చని రెండు వారాల క్రితం జమీన్‌రైతు వెలిబుచ్చిన వూహ నిజమైంది. బెంగుళూరు పోలీసులు అరెస్ట్ చేసిన ఇబ్రహీం అనే అనుమానితుడు విజయవాడ నగరంలోని వించిపేట నివాసి అని పోలీసులు ధృవీకరించారు. అతడి ఇంట్లో క్రైస్తవ మత వ్యతిరేక సాహిత్యం, కరపత్రాలు బయటపడడం వల్ల, నేరస్తుల ముఠాలో అతడికి తప్పకుండా పాత్ర వుంటుందని పోలీసులు భావిస్తున్నారు.

నేరం చేసేవాడు ఎంత తెలివిగా ప్రవర్తించినా, ఏదో ఒక రూపంలో ఆ నేరం బయటపడక తప్పదన్న దానికి ఈ సంఘటనే రుజువు. పోలీసులు ఎంత ప్రయత్నించినా బాంబు పేలుళ్లకు ఎవరు బాధ్యులో కనిపెట్టలేక పోయారు. కాని, ఈ అనుమానితులు ప్రయాణిస్తున్న మారుతి వ్యాన్‌లోని బాంబులు ప్రమాదవశాత్తు పేలిపోవడంతో, రహస్యం బట్టబయలై పోయింది. వ్యాన్‌లోని ఇద్దరు చనిపోయారు; ఇబ్రహీం మాత్రం బ్రతికాడు. అతడి ద్వారానే మొత్తం కథ వెలికి రావాలి ఇప్పుడు. *

## తలలు బోడులైన...

### పెద్దరికానికి పెద్దాయన తాపత్రయం!

తలలు బోడులైనా తలపులు బోడులౌనా అన్న సామెత వూరికే పుట్టలేదు. వృద్ధ కాంగ్రెస్ నేత కోట్ల విజయభాస్కరరెడ్డి గారు కేంద్రంలో తిరిగి తన ఉనికి నిరూపించుకోవడానికి పడుతున్న తాపత్రయం చూస్తే చిరా కాల మహిమ అన్పిస్తున్నది. ఆయన వయస్సు ఎనభై దాటింది; ఎదుటి మనిషి చెప్పేది సరిగా వినపడదు. కాని ఆయనకు రాజకీయం పట్ల మోజు మాత్రం తీరడం లేదు. మొన్నటి ఎన్నికలలో కర్నూలు స్థానం నుంచి ఓడిపోయిన తర్వాత ఆయన రాజకీయ సన్యాసం తీసుకొంటున్నట్లు మాట్లాడారు; ఢిల్లీలో తన ఇల్లు ఖాళీ చేసి, సామాను హైదరాబాదుకు తరలించారు. ఎవరైనా రాజకీయం మాట్లాడబోయినా అసహనం ప్రదర్శించేవారు. మోకాలికి ఆపరేషన్ చేయించుకోవడానికి ఆస్పత్రిలో చేరితే, సోనియాగాంధీ కనీసం మర్యాద పూర్వకంగా కూడా పలకరించలేదని అలిగి వుండినారు. ఆ ప్రసూతి వైరాగ్యం ఎట్లా పోయిందో కాని ఇప్పుడు మళ్లీ ఢిల్లీ రాజకీయ రంగ ప్రవేశం చేశారాయన. రేపు నవంబర్‌లో జరగనున్న పార్టీ ఎన్నికల్లో సిడబ్ల్యుసి సభ్యత్వం తిరిగి పొందాలన్నది ఆయన ఆకాంక్ష. సిడబ్ల్యుసి సభ్యుడిగా వుంటే పార్టీ కేంద్ర స్థాయిలో జరిగే నిర్ణయాలలో పాత్ర లభిస్తుంది. అందుకోసం ఆయన ఇప్పుడు సోనియా గాంధీని ప్రసన్నం చేసుకోవడానికి సకల ప్రయత్నాలను ప్రారంభించారు.

రాజకీయాలకు రిటైర్‌మెంట్ వయస్సు వుండాలన్న కోరిక - ఇటువంటి వారిని చూసినప్పుడే కల్గుతుంది.*

# తెలుగు సేన లక్ష్యం రౌడీయిజమా?

కరెంట్ ఛార్జీల పేరుతో వీధుల్లో అలజడి సృష్టిస్తున్న సిపిఎం, కాంగ్రెస్ కార్యకర్తలను ప్రతిఘటించడానికి తెలుగుసేన ప్రారంభించాలన్న ముఖ్యమంత్రి నిర్ణయం చాలా ప్రమాదకరమైనది. రాజకీయంగా ఎదుర్కోవలసిన సమస్యను వీధి పోరాటంగా మలచడానికి ముఖ్యమంత్రి ప్రయత్నిస్తున్నారన్న అభిప్రాయం కలుగజేస్తున్నది ఈ ప్రకటన. తెలుగు దేశం మంత్రులు, ఎమ్మెల్యేలు పాల్గొనే సభలు ప్రశాంతంగా జరిగేటట్లు చూడటం మాత్రమే తెలుగు సేన విధి అని చెప్తున్నారు చంద్రబాబు నాయుడు గారు. కాని మంత్రులు ప్రభుత్వ ప్రతినిధులే తప్ప, తెలుగుదేశం నేతలు కాదు. పార్టీ సమావేశాలలో మాత్రమే వారు పార్టీ నాయకులు, శంకుస్థాపనలు, ప్రారంభోత్సవాల వంటి ప్రభుత్వ కార్యక్రమాలలో వారు ప్రభుత్వ ప్రతినిధులు మాత్రమే. అటువంటి సభలలో

> **రాజకీయంగా ఎదుర్కోవలసిన సమస్యపై వీధిపోరాటం చేస్తారా?**

తమ నిరసన తెలిపే హక్కు ప్రతిపక్షాలకు వుంది. నిరసన తెల్పడానికి వచ్చినవారు, సంఘటితంగా నినాదాలు చేస్తున్నంత సేపు పోలీసులు సైతం వారిని అడ్డగించడానికి లేదు; అది పూర్తిగా చట్టబద్ధమైన హక్కు. కాని ముఖ్యమంత్రి ఏర్పాటు చేయ తలపెట్టిన తెలుగు సైన్యం ఈ సభలకు వచ్చే ప్రతిపక్ష కార్యకర్తలను ప్రతిఘటిస్తుందట; దాని అర్థం రౌడీలతో నిరసనలను అణచివేయడం. ప్రభుత్వమే రౌడీలను నియమించి, తమ వ్యతిరేకులపై బల ప్రయోగం చేయిస్తే ఏమి జరుగుతుందో ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. అది అరాచకానికి దారితీస్తుంది. చంద్రబాబు నాయుడు గారికి ఇటువంటి ఆలోచనలు ఎందుకు వస్తున్నాయో దురూహ్యం. *

# సణుగుడు

◆ కలెక్టర్ ఉద్యోగం కత్తిమీద సామువంటిదై పోయింది !

◆ కరెంట్ ఛార్జీలకు ఆటో డ్రైవర్ సమర్థన !

పాత కలెక్టర్ వెళ్లి, కొత్త కలెక్టర్ వచ్చారు; పాత నీరు వెళ్లి కొత్త నీరు రావడం ఎంత సహజమో, కలెక్టర్ వంటి అధికారులు బదలీల మీద జిల్లా వదలి వెళ్లిపోవడం అంతే సహజం. కాని కలెక్టర్ మారినప్పుడల్లా జిల్లాలో ఆ బదలీపై చర్చ జరగడం మామూలు. కొందరు కలెక్టర్లు జిల్లా వదలి వెళ్తుంటే జనం తమ ఆప్తుడు, ఆత్మీయుడు తమను వదలి వెళ్తున్నంతగా బాధ పడ్తుంటారు. నాకు తెలిసిన గత ముప్ఫైయేళ్ల చరిత్రలో ఇటువంటి అదృష్టానికి నోచుకున్న కలెక్టర్లు చాలా కొద్ది మంది; అందులో ప్రథముడు శంకరన్. ఆయన నెల్లూరు వదలి వెళ్లిన తర్వాత చీఫ్ సెక్రటరీ స్థాయికి ఎదిగారు, రిటైర్ కూడా అయ్యారు. కాని ఇప్పటికీ కొన్ని గ్రామాలలో శంకరన్ పేరు తలచుకొంటూనే వుంటారు. పేదల పక్షపాతం, వారి కోసం శ్రమించే చిత్త శుద్ధి,

డోలేంద్ర

నిజాయితీ, నిర్భీతి వంటి గుణాలకు అప్పటికీ, ఇప్పటికీ శంకరన్ గారు ఒక ఉదాహరణ. ఆయన్ను త్రిపుర చీఫ్ సెక్రటరీగా బదలీ చేస్తే, అప్పటి ముఖ్యమంత్రి నృపేన్ చక్రవర్తి అనుకుంటాను - మా రాష్ట్రానికి ఆంధ్రప్రదేశ్ ప్రసాదించిన గొప్ప వరం - శంకరన్ అని వ్యాఖ్యానించాడు. అంటే మూనూగు మీసాల నూత్న యవ్వనంలో కలెక్టర్‌గా పని చేస్తున్నప్పుడు ఎటువంటి ఆదర్శ భావాలు, ఆశయాలు కలిగి వుండినాడో, రిటైర్‌మెంట్ దశలోనూ అదే వైఖరి నిలబెట్టుకున్నాడన్న మాట. మహాపురుషులనదగిన వారికి తప్ప ఇంత కాలం, ఈ దుర్మార్గపు వ్యవస్థలో అంతటి ఆశయ నిబద్ధత సాధ్యం కాదు. అంతటి గొప్ప మనిషి నెల్లూరులో కలెక్టర్‌గా పని చేయడం నెల్లూరు అదృష్టం.

కలెక్టర్ స్థాయిలో తనకు గల అధికారాన్ని సద్వినియోగం చేసి పేదలకు వుపకారం చేయాలన్న తపన పడిన మరొక కలెక్టర్ - అర్జునరావు గారు. ఆయన తన స్వంత ఆలోచనతో ప్రారంభించి, అమలు చేసిన జాయింట్ ఫార్మింగ్ సొసైటీలు వందలాది గ్రామాలలో, వేలాది పేద వ్యవసాయ కూలీలను రైతులుగా మార్చాయి. ఇప్పటికీ, అప్పుడు ఆయన ఇచ్చిన అరెకరా, పాతికెకరా భూమి సాగు చేసుకొంటూ, గౌరవంగా బ్రతుకుతున్న దళిత కుటుంబాలు చాలా వున్నాయి. ఈ సమిష్టి వ్యవసాయ క్షేత్రాల పథకం అమలు కోసం అర్జున రావు గారు పడిన తపన అసాధ్యమైనది. ఎమర్జెన్సీ రోజులవి. కాంగ్రెస్ నాయకులను ధిక్కరించి ఎంత పెద్ద ఉద్యోగి కూడా బ్రతకలేని పరిస్థితి. పేదలకు భూమి పట్టాలు, అది కూడా చెరువుల్లో పంచుతుంటే, గ్రామ పెద్దలు ఎంత ఆగ్రహించారో చెప్పలేము. అప్పటికి గ్రామాలలో ఫ్యూడల్ వ్యవస్థ బ్రతికే వుండింది. పెద్ద రైతును కాదని పేద వాడు జీవించడం కష్టం. ఎమ్మెల్యే వంటి రాజకీయ వాదులు జనంపై కంటే ఇటువంటి గ్రామ పెద్దలపైనే ఆధారపడే వారు. ఎన్నికల్లో ఇప్పటి వలె అభ్యర్థులు ప్రచారం కోసం గ్రామాలకు వెళ్లే వారు కాదు; గ్రామ పెద్దలకు చీటీలు వ్రాసి పంపేవారు. ఆ పెద్ద ఎట్లా చెప్తే అట్లా ఓట్లు పడేవి. అందువల్ల నాయకులపైన గ్రామ పెత్తందారుల ప్రభావం చాలా అధికం. అటువంటి ఒత్తిడిని తట్టుకుని మరీ పేదలకు కొన్ని లక్షల ఎకరాల భూమి పంచి పెట్టాడు అర్జునరావు గారు; ఆ భూముల సాగుకు మోటార్లు, ట్రాక్టర్లు, కరెంట్ కనెక్షన్లు ఇప్పించాడు, సహకార సంస్థల నుంచి అడిగినంత అప్పులు ఇప్పించాడు. ఆయన నెల్లూరులో వున్నన్ని రోజులూ ఈ కార్యక్రమం ఒక తపస్సుగా భావించి పనిచేశాడు. అయితే ఎందువల్లో నెల్లూరు వదలి వెళ్లిన తర్వాత అర్జునరావు గారిలో ఈ నిబద్ధత నిలబడినట్లు లేదు. కాని ఈ నాటికీ గ్రామాలలో అర్జునరావు గారి పేరు నిలిచివుంది.

పేద ప్రజలతో మమేకమైన మరొక కలెక్టర్ కొప్పుల రాజుగారు. ఆయనది విభిన్నశైలి. పేదలు, దళితులకు ఇళ్ళ స్థలాలు, బంజరు భూములు పంచడం కంటే వారిలో అక్షర జ్ఞానం, సామాజిక చైతన్యం కల్గించడం అవసరమని భావించినవాడు - రాజు గారు. పేద ప్రజలు మానసికంగా సంఘంలో సమస్థాయికి ఎదిగినప్పుడే, ఆర్థిక అభ్యున్నతి వల్ల వారి జీవితాలలో మార్పు వస్తుందనే సిద్ధాంతం నమ్మినవాడాయన. దళితుల జీవితాల పట్ల సానుభూతి, వారిని జాగృతం చేయాలన్న తపన, వారి సామాజిక పరిస్థితులలో మార్పు తేవాలన్న ఆర్తితో పనిచేశారు రాజుగారు. ఈ ఆశయ సాధన తన అధికార పరిధిలో లేని విషయం; ఇటువంటివి సామాజిక కార్యకర్తలు, సంఘ సంస్కర్తలు చేపట్ట వలసిన పనులు. కాని రాజు గారిలోని ఆత్మవిశ్వాసం, సంకల్ప బలం ఈ ఆటంకాన్ని అధిగమించేటట్లు చేసింది. ప్రభుత్వం ప్రకటించిన అక్షర దీపం కార్యక్రమాన్ని తన ఆదర్శాల అమలుకు సంధానంగా మలుచుకున్నాడు. ఆ పేరుతో గ్రామ, గ్రామాన జన చైతన్య యాత్రలు నిర్వహించాడు. రోజుకు ఇరవై గంటలు పని చేసేవాడు ఆయన. అర్ధ రాత్రి వరకు మారుమూల పల్లెల్లోని హరిజన వాడల్లో, నిరుపేద జనం మధ్య గడిపేవాడు. రాజు గారు చూడని గ్రామం నెల్లూరు జిల్లాలో లేదు.

తరువాయి 11వ పేజీలో

# కండ్లేరు రిజర్వాయర్‌కు ఈ యేడు కూడా జలయోగం లేదా?

ఈ ఏడాది వానలు దండిగా కురుస్తున్నాయి; నెల్లూరులో కంటే పెన్నకు ఎగువన కడప, కర్నూలులో వర్షం కుండపోతగా వుంది; కుందు, చిత్రావతి నదులు మూలంగా పెన్నకు చాలా ముందుగా పుష్కలంగా నీళ్లు వచ్చాయి. సోమశిలలో జలకళ కన్నుల పండుగగా వుంది. కాని అన్నీ వున్నా అల్లుడి నట్ల శని వున్నట్లు, కండ్లేరు రిజర్వాయర్‌కు మాత్రం ఈ సంవత్సరం కూడా నీటి యోగం వున్నట్లు కన్పడటం లేదు.

కండ్లేరు రిజర్వాయర్ నిర్మాణం పూర్తి అయ్యి ఐదేళ్లు గడుస్తున్నాయి. 1996 చివరలోనే చంద్రబాబు నాయుడు, కరుణానిధిలు సత్యవేడు దగ్గర తెలుగుగంగ కాల్వ వద్దున నిలబడి, ఇస్తినమ్మా వాయనం, పుచ్చుకొంటి వాయనం అన్నట్లు నీళ్ల బిందెలు ఇచ్చి పుచ్చుకున్నారు. అంతటితో తెలుగుగంగ పని అయిపోయిందనుకున్నట్లున్నాడు చంద్రబాబు నాయుడు. ఆ తర్వాత ఆయన ఈ ప్రాజెక్టు మీద చిల్లిగవ్వ ఖర్చు పెట్టలేదు.

తెలుగు గంగ ఉద్దేశ్యం మద్రాసుకు మంచినీళ్లు ఇవ్వడమే అయినా, దానితో పాటు నెల్లూరు, కడప, చిత్తూరు, కర్నూలు జిల్లాలకు సాగు నీళ్లు ఇవ్వాలన్న లక్ష్యంతోనే అన్ని వేల కోట్లు వ్యయం చేశాడు ఎన్‌టి. రామారావు. ఆ తర్వాత వచ్చిన కాంగ్రెస్ ముఖ్యమంత్రులు కూడా ఆ ప్రాజెక్టుకు ప్రాధాన్యత ఇచ్చారు. కాని చంద్రబాబు మాత్రం దాన్ని దారుణంగా నిర్లక్ష్యం చేస్తున్నారు.

కండ్లేరు రిజర్వాయర్ నిర్మాణానికి దాదాపు రెండు వందల యాభై కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టారు; దాని నీటి నిల్వ సామర్థ్యం 73 టిఎంసి అడుగులు. మద్రాసుకు ఇవ్వాల్సిన మంచి నీళ్లు కేవలం 5 టిఎంసి అడుగులు. తతిమా 68 టిఎంసిల నీళ్లు మన రైతుల పొలాలకు పారాలి... ఒక్క టిఎంసి అడుగు నీరు 10వేల ఎకరాల సాగుకు సరిపోతుంది. అంటే కండ్లేరు రిజర్వాయరు సక్రమంగా వాడితే రాపూరు, వెంకటగిరి, సూళ్లూరుపేట, నాయుడుపేట వంటి ప్రాంతాలు ఒక్క ఎకరా కూడా బంజరు భూమిగా వుంచనవసరం లేదు. మెట్టలన్నింటినీ మాగాణులుగా మార్చుకోవచ్చు.

## జిల్లా ఎమ్మెల్యేలకు ఈ సంగతి పట్టడం లేదేమి?

కాని ఈనాటి వరకు ఈ రిజర్వాయర్లో 11 టిఎంసి అడుగులకు మించి నీళ్లు పెట్టడం లేదు. అందుకు అధికారులు చెప్పే కుంటి సాకు పెంచలకోన రోడ్డు నిర్మాణం పూర్తికాలేదు కాబట్టి నీళ్లు పెడితే పెంచలకోనకు దారి వుండదు అన్నది. చచ్చు వాదన ఇది. రాష్ట్రంలో రోడ్ల అభివృద్ధికి గత ఐదేళ్లలో వెయ్యి కోట్లకు పైగా ఖర్చు పెట్టింది ప్రభుత్వం. అటువంటప్పుడు రెండు లేదా మూడు కోట్లతో పూర్తి కావాల్సిన పెంచలకోన రోడ్డు పనికి ఆటంకం ఏమిటి? అసలు కారణం అది కాదు; నీళ్లు పెడితే కండ్లేరు రిజర్వాయర్ కట్టలు నిలుస్తాయన్న నమ్మకం ఇంజనీర్లలో లేదు. అంత సుందర ముదనష్టంగా కట్టారు దాన్ని. లంచాలు తినడంలో మునిగిపోయిన ఇంజనీర్లు కాంట్రాక్టర్లు కట్ట మీద వేసిన మట్టి ఎట్లా వుందో చూసుకోలేదు. ఫలితం, కట్ట అవకతవకగా తయారు కావడం. 15 టిఎంసికు మించి నీరు పెడితే కట్టకు గండి పడుతుందని వీరి భయం; అందువల్ల ప్రతి సంవత్సరం ఏదో ఒక సాకు చెప్పి రిజర్వాయరును ఖాళీగా వుంచేస్తున్నారు.

జరిగిందేదో జరిగిపోయింది; కాంట్రాక్టర్ల దగ్గర తిన్న లంచాలు ఎప్పుడో జీర్ణమై పోయాయి. ఇప్పుడు జరగవల్సింది, కట్ట బలహీనంగా వున్న చోట రాళ్లతో రివిట్‌మెంట్ ఏర్పర్చడం. ప్రభుత్వం ఆ పని చేస్తే, రిజర్వాయరును పూర్తి నీళ్లు నింపవచ్చు; అది జరిగితే, ఒక వేళ బ్రాంచి కాలువల త్రవ్వకానికి ప్రభుత్వం వద్ద డబ్బు లేకపోయినా, ఈ చెరువు చుట్టు ప్రక్కల తాలూకాలలో భూగర్భ జల మట్టం పెరిగి, రైతులు కనీసం బోర్లు వేసుకుని అయినా సాగు చేసుకోగలుగుతారు; ఇప్పుడు వున్న నిమ్మ తోటలు, కొద్దిపాటి ఆయకట్టు భూమికి కనీసం రెండు ఏళ్లపాటు నీళ్ల కరువు వుండదు. రివిట్‌మెంట్ చాలా చిన్న పని. నూరు కోట్ల లోపల పూర్తి చేయగల్గిన పని. జిల్లా ఎమ్మెల్యేలు, మంత్రి గట్టిగా పట్టుబడితే ముఖ్యమంత్రి నిధులు ఇవ్వకుండా తప్పించుకోగలడా? జిల్లా మేలు కోసం మన రాజకీయ నేతలు ఈ చిన్న పని చేయలేరా? *

# లాఠీలతో ఉద్యమాలు ఆపలేరు!

అరచేతిని అడ్డుపెట్టి సూర్య కాంతిని ఆపలేరు; లాఠీలతో వుద్యమాలు నిలపలేరు. వంటివి కమ్యూనిస్టులు చేసే నినాదాలు మాత్రమే కాదు. అవి నూటికి నూరుపాళ్లు వాస్తవాలు కూడా. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు గారికి ఈ నిజం అవగతమైనట్లు లేదు. దాన్ని అర్థం చేసుకుని వుంటే ఆయన కరెంట్ ఛార్జీల పెంపకం పట్ల అంత అసందర్భంగా మాట్లాడలేరు.

కరెంట్ ఛార్జీల పెంపకం పట్ల రాజకీయంగా చంద్రబాబు నాయుడు గారి వైఖరి కాని, పాలనా పరంగా పోలీసుల ప్రవర్తన కాని సక్రమంగా లేవనడం నిజం. ఉద్యమకారులపైన విష ప్రచారం చేయడం ద్వారా ముఖ్యమంత్రి, లాఠీలు ఝుళిపించడం ద్వారా పోలీసులు ఉద్యమాన్ని అణచి వేయడానికి ప్రయత్నిస్తున్నారు. కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీలు అరాచకం ప్రేరేపిస్తున్నాయని, ప్రజలలో "టెర్రర్" సృష్టిస్తున్నాయని, నక్సలైట్ల వలె వ్యవహరిస్తున్నారని, ఇటువంటి ఆందోళనలను నిషేధించడానికి దేశవ్యాప్త చర్చ జరపాలని మాట్లాడుతున్నాడు ముఖ్యమంత్రి. ఇంకొక ప్రక్క పోలీసులు ఎక్కడ ఉద్యమకారులు కన్పించినా లాఠీలు ఝుళిపిస్తున్నారు. తిరుపతి, విజయవాడలలో వారు వుద్యమకారులను చావబాదారు. ఆందోళనను సమసింపచేయడానికి, అదుపులో పెట్టడానికి పోలీసులు ప్రయత్నించడం వేరు; ఆందోళన జరుపుతున్న వారిని విచక్షణారహితంగా లాఠీలతో చావబాదడం వేరు. కనీసం మహిళలు అనే సానుభూతి సైతం లేకుండా పోలీసులు కన్పించిన వారిని కన్పించినట్లు పశువులను కొట్టినట్లు కొట్టారు. వారు చేసిన తప్పిదం, ముఖ్యమంత్రి వెళ్తున్న కారుకు అడ్డం వెళ్లి, ఛార్జీల పెంపకం పట్ల నిరసన తెల్పుతూ నినాదాలు చేయడం; అది పెద్ద నేరంగా కన్పించింది వీరికి.

మరీ విచిత్రం ఏమిటంటే, ఈ పోలీసు దౌర్జన్యాన్ని పత్రికలు ప్రచురించడం కూడా సహించలేకపోయారు చంద్రబాబు నాయుడు గారు. పత్రికలు పాజిటివ్ ధోరణి అలవరచుకోవాలని హితవు చెప్పారాయన. ప్రభుత్వ నిర్ణయాలకు వ్యతిరేకంగా 'ఉద్యమించడం అంటే, ప్రగతిని అడ్డుకోవడం అన్న నూతన సిద్ధాంతం ప్రవచించాడు ముఖ్యమంత్రి.

ప్రభుత్వాన్ని నడిపే వారికి తమ పట్ల, తమ నిర్ణయాల పట్ల వ్యతిరేకత వ్యక్తమైనప్పుడు అసహనం కల్గడం సహజం; కాని దానికి ఒక హద్దు వుంటుంది; ఒక పరిమితి వుంటుంది. ఆ రెండంటినీ మీరు తున్నాడు ముఖ్యమంత్రి. కరెంట్ ఛార్జీల పెంపకం అధికంగా వున్న దన్నది ప్రజల అభిప్రాయం; అది గత నెలన్నర రోజులుగా పలుమార్లు రుజువైంది. ప్రజలలో ప్రభుత్వ నిర్ణయాల పట్ల అసంతృప్తి ఏర్పడి నప్పుడు, దాన్ని ప్రభుత్వ దృష్టికి తెచ్చి, ఒత్తిడి కల్పించి, ఆ నిర్ణయా లను ఉపసంహరించేటట్లు చేయ డానికి నిరసన ప్రదర్శనలు, ఆందోళనలు చేపట్టడం ప్రతిపక్ష రాజకీయ పార్టీల కర్తవ్యం. రాష్ట్రంలో ఇప్పుడు కాంగ్రెస్ పార్టీ కాని, కమ్యూనిస్టులు కాని చేస్తున్నది అదే. ఇప్పటి వరకు ఎక్కడ కూడా ఆందోళనలు శృతిమించలేదు. ధర్నాలు, రాస్తా రోకోలు, సత్యాగ్రహాలు, వినతి పత్రాల సమర్పణలు మన దేశంలోనే కాక ప్రపంచ వ్యాప్తంగా ప్రజాస్వామ్య దేశాలు అనుసరిస్తున్న నిరసన విధానాలు. వాటిలో అరాచకం లేదు, టెర్రర్ అసలే లేదు. ఈ ఆందోళనలో పాలు పంచుకుంటున్న కార్యకర్తలు, నాయకులు ఆయుధాలు చేపట్టి, హింసను ప్రేరేపిస్తుంటే దాన్ని పోలీసులు కాని, ముఖ్యమంత్రి కాని ఖండించవచ్చు; లేదా నిరోధించవచ్చు. ప్రజలు, కార్యకర్తలు కలిసి ఒక బృందంగా వీధులలో ప్రదర్శనలు జరపడం "టెర్రర్" సృష్టించడం అవుతుందా? నిజానికి ప్రదర్శనకారుల పట్ల పోలీసులు అనుసరిస్తున్న వైఖరి హింసాత్మకంగా వుంది. అక్రమంగా, ప్రేరేపణ లేకుండా ఉద్యమకారులపై విరుచు కపడి చితక బాదుతున్నారు. ఇప్పటి వరకు జరిగిన సంఘటనలలో ఉద్యమకారులకు తలలు పగిలాయి, చేతులు విరిగాయి తప్ప ఎక్కడైనా ఒక్క పోలీసు లేదా ప్రభుత్వ ఉద్యోగికి అసౌకర్యం జరిగిందా? దీన్ని బట్టి హింసకు తలపడుతున్నది ఎవరో ముఖ్యమంత్రికి తెలియదా?

**జమీన్‌రైతు**

ప్రజాస్వామ్యబద్ధ నిరసనలను, ప్రభుత్వ వ్యతిరేక నిర్ణయాలుగా భావించడం చంద్రబాబు నాయుడు ఆలోచనా తీరు దారితప్పిందన్న నిజాన్ని వ్యక్తం చేస్తున్నాయి. ఒక రకంగా చెప్పాలంటే ఇది ఫాసిస్టు ఆలోచనా ధోరణి. పత్రికలు ఏమి వ్రాయాలో, ఏది వ్రాయకూడదో చెప్పే స్థాయికి వెళ్తున్నాడంటే, ఆయనలో నిరంకుశ వైఖరులు తలెత్తుతున్నాయనిపిస్తున్నది.

ప్రజాస్వామ్యంలో అత్యంత బలీయమైన శక్తి ప్రజాభిప్రాయం మాత్రమే. ప్రభుత్వ యంత్రాంగం, పోలీసుల లాఠీలు దాని ముందు చీపురు పుల్లలతో సమానం. ప్రజల అభిప్రాయాలకు, ప్రయోజనాలకు విరుద్ధంగా ఎంత గొప్ప పరిపాలకుడు కూడా మనజాలడు. అది చరిత్రలో పలుమార్లు రుజువైన వాస్తవం. చంద్రబాబు చరిత్రను తిరగ వ్రాయకల్గిన శక్తిమంతుడేమీ కాదు. పరిపాలనా పరంగా కరెంట్ ఛార్జీల పెంపకం తప్పని సరి నిర్ణయమైతే, అది లేకుండా తాను పరిపాలిం చలేననుకుంటే, ఆయన చేయవల్సిన పని ఆ విషయాలు ప్రజలకు నచ్చ చెప్పడం మాత్రమే; అందుకు ఆయనకు వున్న మార్గాలు కూడా కేవలం ప్రదర్శనలు, సభలు మాత్ర మే. ప్రతిపక్షాలు చేప్పేవి నిజాలు కావని, తాను చెప్తున్నవి వాస్తవాలని ఆయన ప్రజలను నమ్మించ కల్గితే, నిరసన ఉద్యమం దానంతట అదే సమసిపోతుంది. అంతే తప్ప పోలీసు బలం ప్రయోగించి, వుద్య మకారులను చావగొట్టి, జైళ్లలో పెట్టి వుద్యమాన్ని అణచివేయాలని ఆయన భావిస్తుంటే అందుకు మూల్యం చెల్లించవల్సి వచ్చేది కూడా తానేనని ఆయన గ్రహించడం అవసరం. బల ప్రయో గంతో, లాఠీలతో ఉద్యమాలు అణిగిపోయే పక్షంలో మనకు స్వాతంత్ర్యం ఇస్తారా బ్రిటీష్ దొరలు; వారి కంటే క్రూరంగా ప్రవర్తించగలడా చంద్రబాబు? *

---

## జమీన్‌రైతు

14.7.50

వెల: 0-2-0 పేజీలు: 12

### మీరు విన్నారా?

ఈసారి రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష స్థానానికి మంత్రి వర్గపు అభ్యర్థి తొంభై తొమ్మిది పాళ్లు వి.సి. రెడ్డి అని అందరూ అనుకొంటుంటే, 'అలా లేదు, చాలు లేదు. అప్పుడే కొడుకు పేరెందుకు' అని వి.సి.రెడ్డి 'జమీన్‌రైతు' విలేఖరి అడిగితే చెప్పాడని, అయినా ఆర్భాటము పబ్లిసిటీ కాంక్షలేని సుబ్బారెడ్డి, ఎప్పుడో జరగబొయ్యేదానికి, ఎటుంది ఎటు వస్తుందో యిప్పుడే బయట పెట్టుకోవడం ఎందుకులే అని చెప్పి వుండడని, వి.సి.రెడ్డి తత్వం తెలిసిన కొందరు తత్వవేత్తలు తలపోసు కొంటుండినారట.

### అంటుంటారు - వింటుంటాం!

కాంగ్రెస్ పంచాయితీ ఎన్నికలు గాని, మరొక యెన్నికలు గాని పెద్ద మనిషితనంగా గోపాలురెడ్డి, గారి మాదిరి మడిగట్టుక కూర్చుంటే ఆ పక్షం అక్షరాలా ఓడిపోతుంది. అందుకని కవి చెప్పె.

*ధాత తైన గాని అతని*
*శాస్త్రిన ఎలక్షనందు తగుపాటి దగా*
*చేతన కళ తెలియనిచో*
*కాతరపడి చెడును గదర కవి చెప్పె*

అని అన్నాడు. ఆయా పక్షియులు తన పక్షం మంచిది రెండో పక్షం చెడ్డది అంటుంది. కాని యే పక్షంలోగాని ఆయా పక్ష నాయకులున్నంత నీతిపరంగా అనుయాయులు వుంటారనుకోవడం పొరపాటు. వారికి పట్టిన పిచ్చి మనకు పట్టనవసరం లేదు. రెండు పక్షాల్లో మంచివారు, రెండు పక్షాల్లోను చెడ్డవారునూ వుంటారనేది మనం ఒప్పుకొంటే సరిపోతుంది.

- చిత్రగుప్తుడు

### హైదరాబాద్ వృత్తాంతం

నైజామును ముద్దాయిగా చేసి, తన

**50 ఏళ్లక్రితం ఈవారం**

కేసులో విచారణ చేయడం న్యాయమని కాశీం రజ్వీ బల్ల గ్రుద్ది వాదించెను. నైతికంగా న్యాయమేగాని కోర్టు వారియెదుట లా ప్రకారం కర్మకాండ జరగవలెను. గనక రజ్వీ కోర్కె తీరలేదు. ఇదంతా విని (జల్నెవాలె జలానేదే, కిస్మత్ మేరె సాథహై' అని నైజాం భావించాడట. - మా.వి

### నెల్లూరు ముచ్చట్లు

#### ఆసుపత్రి

నెల్లూరు మునిసిపల్ ఆసుపత్రి - కారు శ్యామ అయ్యంగారు ఆసుపత్రి డాక్టరు. ఆయుర్వేద విశారద కేసరి గురుమూర్తి శాస్త్రిగారు ఉద్యోగాన్నుండి రిటైరైనారు. శాస్త్రిగారు చక్కగా చదువుకొన్న ఆయుర్వేద

తరువాయి 10వ పేజీలో

---

## జనవాణి

# పిల్లల పార్కా? చిల్లర పార్కా??

నెల్లూరు చింతారెడ్డిపాలెం డొంకలో నిర్మించిన చిన్న పిల్లల పార్కుకు ప్రవేశ రుసుం నిర్ణయించడం సహేతుకంగా లేదు. పార్కు నిర్మాణానికి మునిసిపల్, జన్మభూమి నిధులతోపాటు దాత జె.ఎస్.రెడ్డి 50 లక్షల రూపాయలు విరాళమిచ్చారు. అంటే ప్రజాధనాన్ని వెచ్చించి పార్కును నిర్మించారు. చిన్న పిల్లలకు ఆరోగ్య, మానసిక వికాసానికి దోహదపడే పార్కులో డబ్బున్నవాళ్లే కాలు పెట్టాలని నిబంధన విధించడం ప్రజాస్వామ్య సూత్రాలకు విరుద్ధం. జాగింగ్‌కు, స్కేటింగ్‌కు, మ్యూజికల్ ఫౌంటెన్ సందర్శన కోసం ప్రత్యేక ఫీజులు నిర్ణయించి పార్కును వాణిజ్య సంస్థను చేయడం తప్పు. 7కోట్ల స్థలం, 2కోట్ల నిధులు వెచ్చించిన మునిసిపాలిటీకిగాని, 50 లక్షలు ఏం ఆశించకుండా ఇచ్చిన జె.ఎస్.రెడ్డిని త్రోసి రాజని పనికిమాలిన టూరిజం శాఖకు దీని నిర్వహణ బాధ్యతలు అప్పచెప్పడం బాధాకరం. కొత్త కలెక్టర్ ఈ విషయాన్ని పరిశీలించాలి.

నెల్లూరు జె.బి. అబు

### అసలు ప్రభుత్వం పనిచేస్తుందా?

రాష్ట్రంలో అధికార యంత్రాంగం పనిచేస్తున్నదా, నిద్ర పోతున్నదా అనే అనుమానం కల్గుతూంది. విద్యుత్ శాఖలో వేలాది మంది ఉద్యోగులు పనిచేస్తుంటే, రాష్ట్రంలో 19 లక్షల మంది విద్యుత్‌ను అక్రమంగా ఏ విధంగా వినియోగించుకొంటున్నారు? రెవిన్యూ శాఖలో అధికారులు నిద్రపోబట్టే 6లక్షల బోగస్ కార్డులున్నాయి. ప్రభుత్వం వున్నవారికే అన్ని సుఖాలు కల్పిస్తూంది. చొక్కా నలగకుండా పనిచేస్తూ, వేలాది రూపాయలు జీతాలుగా తీసుకొనే ప్రభుత్వ ఉద్యోగులకు జిల్లా కలెక్టర్ 100 ఎకరాలు ఇళ్ల స్థలాలకు కేటాయించారు. వుండడానికి ఇళ్లులేవని అర్జీల మీద అర్జీలిచ్చిన వారి సంగతి పట్టించుకొనేవారు లేరు.

కొడవలూరు కె. వెంచలయ్య

### ఆప్కాబ్ ప్రణాళికలో జిల్లాలో కరవు లేదు

ఈ యేడాది జిల్లా అంతటా, తీవ్ర కరవు పరిస్థితులు నెలకొన్నాయి. పలు ప్రాంతాల్లో వేసిన పైరు నీరు లేక ఎండిపోయింది. ఫిల్టర్ పాయింట్ల క్రింద సాగుచేసే ప్రాంతాల్లో కూడా అనావృష్టి వల్ల భూగర్భ నీటి మట్టం పడిపోయింది. ఇంతటి క్లిష్ట పరిస్థితుల్లో చిక్కుకొని జిల్లా రైతులు అల్లాడుతుంటే ఆప్కాబ్ వార్షిక ప్రణాళిక (2000 - 2001)లో కరవు ప్రాంతంగా గుర్తించిన జిల్లాలలో నెల్లూరు పేరు లేదు. జిల్లా ప్రభుత్వ యంత్రాంగం 46 మండలాలను కరవు

తరువాయి 10వ పేజీలో

# మంచిజిల్లా - మంచిప్రజలు

కొత్త కలెక్టర్‌గా ప్రవీణ్‌కుమార్ 12తేదీ బాధ్యతలు స్వీకరించారు. హాటు, బూటులో కాకుండా మామూలుగానే తాను బసచేసిన ఆర్అండ్‌బి గెస్ట్‌హౌస్ నుంచి వచ్చి ఉదయం 9.52 నిమిషాలకు బాధ్యతలు స్వీకరిస్తున్నట్లుగా కలెక్టరేట్‌లోని ఫైల్‌పై సంతకం పెట్టారు. కలెక్టర్ 9 గంటలకే బాధ్యతలు స్వీకరిస్తారని ప్రచారం జరగడంతో కలెక్టరేట్ ప్రవేశం ద్వారం వద్ద డిఆర్వో వెంకటేశ్వర్లు, కలెక్టరేట్ కార్యనిర్వహణాధికారి శ్రీనివాసరావు ఎదురు చూస్తూ కనిపించారు. కొత్త కలెక్టర్ రాకను పురస్కరించుకొని కలెక్టరేట్‌లోని వరండా, ముందు గదులను శుభ్రంగా కడగడం తోపాటు ఫినాయిల్ కూడా చల్లించారు. కాని ప్రాంగణమంతా చెత్తా చెదారంతో నిండి వుండింది. కలెక్టరేట్ వాచ్‌మెన్ ఎప్పుడూ లేనిది యూనిఫారంలో కనిపించారు.

బాధ్యతలు స్వీకరించాక కలెక్టర్ తక్కువ స్వరంతో విలేఖరులతో ఆచితూచి మాట్లాడారు. ఈ జిల్లా మంచి జిల్లా - ప్రజలు మంచి వాళ్లని విన్నాను. వ్యవసాయంపై ఆధారపడ్డ జిల్లాకు తుఫాను ప్రమాదం కూడా వుందని తెలుసుకొన్నాను. ప్రస్తుతం జరుగుతున్న ప్రభుత్వ కార్యక్రమాలు అక్షరాస్యతావారోత్సవాలు, వనమహోత్సవాల్లో విరివిగా పాల్గొంటానన్నారు. పత్రికలపై తనకు ఎనలేని విశ్వాసముందని, ప్రభుత్వాధికారుల కన్నా ముందుగా వారు వార్తలను బయటపెడతారని చెప్పారు. జిల్లాను గూర్చి హెడ్డింగ్‌లోని విషయాలు మాత్రమే నాకు తెలుసు. వార్తల్లోని లోతు విషయాలన్నీ

తొరవ 11వ పేజీలో

## కొత్త కలెక్టర్ ప్రవీణ్‌కుమార్

# ఒక అయ్యోరి ఉద్యోగానికి తొమ్మిది మంది కాటాకుస్తీ

నిరుద్యోగులు వేయికళ్లతో ఎదురు చూస్తుండిన టీచర్ల నియామక (డిఎస్‌సి) నోటిఫికేషన్ ఎట్టకేలకు జూలై 3తేది వెలువడింది. అయ్యవార్లు కావాలనుకున్న వారికి బహశా ఇదే ఆఖరి ఛాన్స్ కావచ్చు. అందుకే అరకొర స్టయిఫెండు అయ్యోరు వుద్యోగానికి అర్రులు చాస్తున్నారు. జిల్లాలో ప్రభుత్వ, ఐడీ్ప, మండల పరిషత్, మునిసిపల్ స్కూళ్లలో ఖాళీగా వున్న బియిడి అసిస్టెంట్స్, సెకండరీగ్రేడ్ టీచర్స్, భాషాపండితులు, డ్రిల్ టీచర్ల పోస్టుల భర్తీకి ఆగస్టు 17, 18తేదీల్లో పోటీ పరీక్ష నిర్వహిస్తారు. అంతా సజావుగా సాగిపోతే పరీక్షా ఫలితాలను ఆగస్టు నెలాఖరులోగా ప్రకటించి, సెప్టెంబర్ మొదటివారంలో ఎంపికైన అభ్యర్థులకు పోస్టింగ్ ఆర్డర్స్ ఇస్తారు. ఈ నోటిఫికేషన్ ననుసరించి జిల్లాలో 857 ఉపాధ్యాయుల పోస్టులు భర్తీ చెయాల్సి ఉండగా, దీనికి అర్హత వున్న బియిడి, సెకండరీ గ్రేడ్ పాసై ఎంప్లాయిమెంట్ కార్యాలయంలో నమోదైన నిరుద్యోగులు 7071 మంది వున్నారు. అంటే

తొరవ 11వ పేజీలో

## ఇదే చివరి అవకాశమా?

సిర్డిసాయి రూరల్ వెల్ఫేర్ అండ్ మెడికల్ ఫౌండేషన్ నెల్లూరులో నిర్వహించిన వైద్య శిబిరంలో జ్యోతి ప్రజ్వలన చేసిన రాపూరు ఎమ్మెల్యే ఆనం రామనారాయణరెడ్డి, ప్రక్కన డాక్టర్ పూలా, శ్రీధర్ రెడ్డి, వివేకానందరెడ్డి, సుందరరామిరెడ్డి, విజయకుమార్, కృష్ణమూర్తి, అంజలి వున్నారు.

# కాసులకక్కుర్తే ధర్మారెడ్డి నడ్డి విరిచింది

ఆర్టీసి కండక్టర్ల పోస్టుల ఎంపిక కోసం నిర్వహించిన ఇంటర్వ్యూలలో లంచాలకు కక్కుర్తి పడటం వల్లనే ఆర్టీసి రీజనల్ మేనేజర్ ధర్మారెడ్డికి ఉన్నతాధికారులు సస్పెన్షన్ టాటాకు కట్టి ఇంటికి తరిమేశారు. తానేదో సచ్ఛరిత్రుడనని చెప్పే ధర్మారెడ్డి చరిత్ర సమస్తం కుళ్లిన మురుగుడు చేపల కంపు. ఈయన కొందరు మధ్యవర్తులను ఏర్పాటు చేసుకొని ఇతర జిల్లాల నుంచి మన జిల్లాలోని కండక్టర్ పోస్టులకు దరఖాస్తు చేసిన అభ్యర్థుల నుంచి ముడుపులు తీసుకొని, ఈ జిల్లా వాసులకొంప ముంచారు. నెల్లూరు రీజియన్ పరిధిలో 246 కండక్టర్ పోస్టుల భర్తీకి అప్పటి ఆర్ఎం హోదాలో ధర్మారెడ్డి దరఖాస్తులు ఆహ్వానించారు. ఈ పోస్టులకు పదవతరగతిలో 50శాతం మార్కులు సాధించుకొన్నవారు దరఖాస్తుకు అర్హులుగా పేర్కొనాల్సి వుండగా ఈ నిబంధనను ఆయన పాటించలేదు. అందరూ దరఖాస్తు చేయవచ్చని ప్రకటించారు. రాష్ట్రంలో ఎక్కడా లేనట్లు 50పైసలు ఖరీదు చేసే దరఖాస్తు ఫారాన్ని 50 రూపాయలకు, 10 రూపాయలుగా వుండే రిజిస్ట్రేషన్ ఫీజును 100 రూపాయలుగా నిలబెట్టి వసూలు చేయించారు. ఉద్యోగం మీద దింపుడు కళ్లెం ఆశతో 30వేల మంది నిరుద్యోగులు దరఖాస్తు చేయగా ఆర్టీసికి లక్షల్లో ఆదాయం వచ్చి పడింది. వాస్తవంగా వచ్చిన ఈ మొత్తం 246 మంది కండక్టర్ల రెండేళ్ల అప్రెంటీస్ కాలంలో చెల్లించే జీతాలకు ఇబ్బంది లేకుండా సరిపోతుంది. రాష్ట్రంలో ఏ ప్రాంతంలోని వారైనా ఈ పోస్టులకు దరఖాస్తు చేయవచ్చనే నిబంధన ధర్మారెడ్డి పాలిట వరమయ్యింది. దరఖాస్తు గడువు తేదిని మార్చడం తోపాటు ఇతర జిల్లాల నుంచి దరఖాస్తు చేసిన వారిలో కొందరిని ధర్మారెడ్డి ఎంపిక చేశారు. వీరి ఎంపికలో మార్కుల ప్రాతిపదిక, సీనియారిటీ వ్యవహారమంతా గందరగోళంగా వుంది. దీనికి కారణం ముడుపులని వేరె చెప్పనక్కర్లేదు. ఇది కాకుండా సస్పెండ్ అయిన వారికి మళ్లీ ఉద్యోగాలు, ట్రాన్స్‌ఫర్లకు రేటు నిర్ణయించి నిర్లజ్జగా వసూలు చేయడంతో ఆర్టీసిలో అవినీతి హైటెక్ బస్సులాగా దూసుకుపోయింది. ఈ వ్యవహారం ఉన్నతాధికారుల దృష్టికి పోవడంతో అధర్మ చక్రవర్తి ధర్మారెడ్డిని ఉద్యోగం నుంచి సస్పెండ్ చేసి, ఆర్టీసి కండక్టర్ పోస్టుల ఇంటర్వ్యూలను కూడా రద్దు చేశారు.

## ఆర్టీసి ప్రాంగణంలో అవినీతి జాగరణ

# శ్రీలక్ష్మికి సాదర వీడ్కోలు

జిల్లాను రాష్ట్రంలో అన్ని రంగాల్లో ముందుంచేందుకు సహకరించిన అధికారులు, ప్రజాప్రతినిధులు, ప్రజలకు కలెక్టర్ శ్రీలక్ష్మి కృతజ్ఞతలు తెలియజేశారు. బదలీ సందర్భంగా జిల్లా రెవిన్యూ సర్వీసెస్ అసోసియేషన్ గోల్డన్ జూబ్లీ హాల్‌లో 10తేది ఏర్పాటు చేసిన వీడ్కోలు సభలో ఆమె ప్రసంగించారు. రెవిన్యూ ఉద్యోగులకు పని భారం ఎప్పటికప్పుడు పెరుగుతున్నా నిర్ణీత కాలంలో పనులు పూర్తి చేసి చేయూత నిచ్చారు. ల్యాండ్ రెవిన్యూ వసూళ్లతోపాటు కేవలం మూడు రోజుల్లో అన్ని మండలాల్లో కరవు బియ్యం కూపన్లు అందజేశారు. 11 రోజుల్లో కోటి 10లక్షల రూపాయల రెవిన్యూ వసూలు చేయడంతోపాటు, 20రోజుల్లో 20వేల రేషన్ కార్డులను తొలగించిన రెవిన్యూ సిబ్బంది కృషిని మరువలేనన్నారు. అసెంబ్లీ మునిసిపల్ ఎన్నికలు మా వల్లే లోటుపాట్లు లేకుండా జరిగాయి. పలు పథకాల్లోనూ జిల్లా ముందు నిలిచిందని కలెక్టర్ ఉద్వేగంగా ప్రసంగించారు. జిల్లాలో తాను పనిచేసిన రోజులు తన జీవితంలో తీపి గుర్తులుగా నిలిచి పోతాయని చెప్పినప్పుడు కలెక్టర్ కళ్లు చెమర్చాయి. రెవిన్యూ అసోసియేషన్ నాయకుడు రాంబాబు మాట్లాడుతూ 5 వేల మంది ఉద్యోగులకు 150 ఎకరాల స్థలం ఇళ్ల నిర్మాణం కోసం ఇచ్చిన కలెక్టర్ జిల్లా చరిత్రలో మరొకరు లేరని కొనియాడారు. రెవిన్యూ అసోసియేషన్ అధ్యక్షులు పరంధామయ్య సభకు అధ్యక్షత వహించారు. జాయింట్ కలెక్టర్ కాడ్మియేల్, డిఆర్వో వెంకటేశ్వర్లు, డిఎస్‌ఓ నరసింహారావు, ఆర్డీఓ వెంకటేశ్వర్లు కూడా సభలో మాట్లాడారు. కలెక్టర్‌ను సన్మానించను రెవిన్యూ ఉద్యోగులు ఈ సందర్భంగా పోటీపడ్డారు.

## అక్షరాస్యత వారోత్సవాలు నిర్వహించండి

రాష్ట్రంలో సంపూర్ణ అక్షరాస్యత సాధించే చర్యలో భాగంగా ఈనెల 17తేదీ నుండి 23తేది వరకు అక్షరాస్యత వారోత్సవాలను నిర్వహించమని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు సూచించారు. 11తేది సాయంత్రం జరిగిన వీడియో కాన్ఫరెన్స్‌లో జిల్లా అధికారులతో మాట్లాడారు. 5నుండి 14 సంవత్సరాల మధ్య వయస్సు గల బడి మానేసిన పిల్లల జాబితాలను సిద్ధం చేసుకోమని ముఖ్యమంత్రి సూచించారు. జిల్లాలోని ప్రతి పాఠశాలను సందర్శించి ఎంత మంది బడికి వస్తున్నారు. రాని వారి వివరాలను సేకరించా లన్నారు. అదే విధంగా బాల కార్మికుల వివరాలను కూడా సేకరించి వారిని పాఠశాలలోగాని, హాస్టళ్లలోగాని చేర్పించి చదువు మీద ఆసక్తి

తొరవ 11వ పేజీలో

## నెల్లూరు సంగతులు

# రీకో మీటర్లలో 20 లక్షల స్వాహా!

ఆత్మకూరు గ్రామీణ విద్యుత్ సహకార సంఘం (రీకో)లో అవినీతికి హద్దు పద్దూ లేకుండా పోయింది. ఎవరికి వీలైంది వారు దోచుక తింటున్నారు. రీకో పరిధిలో విద్యుత్ కనెక్షన్లు తీసుకొన్న వినియోగదారుల మీటర్లకు బాక్సులు ఏర్పాటు చేసే విషయమై రహస్యంగా టెండర్లు పిల్చారు. వీటి విలువ 20లక్షలు. దీన్ని పొందిన కాంట్రాక్టరు అత్యంత నాసిరకం బాక్సులు పట్టణంలో పలుచోట్ల ఏర్పాటు చేశారు. రీకో ఈ బాక్సు ఏర్పాటు చేసినందుకు కాంట్రాక్టరుకు ఒక్కొక్కదానికి 482 రూపాయలు చెల్లిస్తామని అగ్రిమెంట్ కుదుర్చుకొంది. ప్రస్తుతం ఈ కాంట్రాక్టర్ ఏర్పాటు చేసిన బాక్సుల విలువ వంద రూపాయలు కూడా చేయదని రీకో డైరెక్టర్ నంది వివేకానందరెడ్డి సైతం చెబుతున్నారు. పాలక వర్గానికి తెలియకుండా ఈ టెండర్‌కు గ్రీన్ సిగ్నల్ ఇవ్వడం వెనుక భారీ మొత్తంలో ఎం.డికి ముడుపులు అంది వుంటాయన్న విమర్శ వినవస్తుంది. ఈ వ్యవహారాన్ని జిల్లా కలెక్టర్ ఒకసారి పరిశీలిస్తే 20లక్షల ప్రజాధనాన్ని కాపాడిన వారవుతారు.

## జిల్లావార్తలు

### ఉదయం, సాయంత్రం రేషన్ షాపులు తెరవాలి

జిల్లాలో చౌక ధరల దుకాణాల ద్వారా వినియోగదారులకు సరఫరా చేసే నిత్యావసర సరకులను ప్రతి నెల 27తేదితో పంపిణీ పూర్తి చేయాలని జాయింట్ కలెక్టర్ దాసరి కార్మియేల్ అన్నారు. 10తేది జాయింట్ కలెక్టర్ ఛాంబర్‌లో జరిగిన ఆహార సలహా సంఘం సమావేశంలో ఆయన పలు సూచనలు, సలహాలిచ్చారు. జిల్లా వ్యాప్తంగా 6లక్షల 31వేల 636 కార్డుదారులున్నారని, గ్రామీణ ప్రాంతాల్లో 4లక్షల 41వేల 571 మంది కార్డుదారులుండగా, పట్టణ ప్రాంతాల్లో లక్షా 90వేల 65 మంది కార్డుదారులున్నారని జాయింట్ కలెక్టర్ వివరించారు. వీరికి జిల్లా వ్యాప్తంగా 1781 చౌకధరల దుకాణాల ద్వారా నిత్యావసర వస్తువులు పంపిణీ చేయడం జరుగుతుందన్నారు. వీటిలో 52 దుకాణాల డీలర్ల పోస్టులు ఖాళీగా వున్నాయన్నారు. మండల

తొరవ 8వ పేజీలో



బదలీ అయిన జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మిని సన్మానిస్తున్న విఏఓల సంఘం. ఫోటోలో డిపిఆర్‌ఓ వెంకటరత్నం, దశరథరామిరెడ్డి, డిఆర్వో వెంకటేశ్వర్లు, విజిలెన్స్ ఎస్పీ గోపీకృష్ణ, జెసి కార్మియల్, విఏఓల సంఘం నేత దేవళ్ల దశరథరామిరెడ్డి వున్నారు.

# తిరగని మీటర్లలో తరగని అవినీతి!

ఆత్మకూరులో కరెంట్ మీటర్లు తిరగడం మానేశాయి. రాష్ట్రం మొత్తం మీద పెరిగిన కరెంట్ ఛార్జీలతో ప్రజలు లబోదిబో మంటుంటే ఆత్మకూరులో మాత్రం 'రీకో' సిబ్బంది లాలూచీ వ్యవహారం వల్ల మీటర్లు తిరగడం లేదు. దీంతో విద్యుత్ సంస్థకు లక్షల్లో నష్టాలు వస్తున్నాయి. ఆత్మకూరు గ్రామీణ విద్యుత్ సహకార సంఘం (రీకో)లో పని చేసే లైన్‌మెన్లు కరెంట్ మీటర్లు తిరగకుండా వేస్తున్న ఎత్తుల వల్ల ఈ ప్రాంతీయులకు పెద్దగా బిల్లులు రావడం లేదు. రీకో పరిధిలో 65 శాతం మంది వినియోగదారులు రెండు నెలలకొకసారి చెల్లించే బిల్లు 72 రూపాయల నుంచి 120 రూపాయలుగానే వుంటుంది. కాని ఈ విధంగా చెల్లించే వారి ఇండ్లలో లేని ఎలక్ట్రానిక్ వస్తువులు లేవు. ఫ్రిజ్‌లు, వాషింగ్ మెషిన్లు, కరెంట్ పొయ్యిలు, మిక్సీలు, కలర్ టీవీలు, కొళాయిలకు మోటార్లు ఈ ఇళ్లలో వున్నాయి. లైన్‌మెన్లు కనెక్షన్లు ఇచ్చే సమయంలో మీటర్ తిరగకుండా డైరెక్ట్‌గా విద్యుత్ ఇళ్లలోకి వచ్చేవిధంగా అమరికచేసి పెట్టి, తృణమో పణమో తీసుకొని సరిపెట్టుకొంటున్నారు. ఈ విధంగా కనెక్షన్ పొందిన వాళ్లు సాయంత్రం 7 గంటలు దాటాక ప్రత్యేకంగా రహస్యంగా ఇంట్లో పెట్టుకొన్న 'స్విచ్' వేయడంతో కరెంట్ రీడింగ్ మీటర్లలో నమోదు కావడం లేదు. ఎవరైనా చెకింగ్ చేయను వస్తుంటే ఈ విషయాన్ని ముందుగానే లైను మెన్లు చెప్పడంతో వినియోగదారులు తమ జాగ్రత్తలలో తాముంటున్నారు. దీనివల్ల వాళ్లను పట్టుకోవడం ఎవరి తరం కావడం లేదు. రీకో, ట్రాన్స్‌కో నుంచి నెలసరి 40 లక్షల యూనిట్లు కొనుగోలు చేస్తుంది. కాని వినియోగదారులు కేవలం 30లక్షల యూనిట్లకు మాత్రమే బిల్లులు కడుతున్నట్లు లెక్కలు చెబుతున్నాయి. మిగతా 10 లక్షల యూనిట్లు ఎక్కడికి వెళ్తున్నాయో ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. విద్యుత్ అక్రమ పద్ధతుల్లో వాడకం మూలంగా రీకో నెలసరి 40లక్షల రూపాయలకు పైగా నష్టపోతుంది. ఈ వ్యవహారం రీకో అధికారులు, పాలక వర్గానికి తెలుసు. కాని రాజకీయ కారణాల వల్ల పట్టించుకోవడం లేదు.

### 40 లక్షల విద్యుత్ చోరీనిపట్టించుకొనే వారేరి?

### రత్నమ్మ కేసులో వీడిన మిస్టరీ!

అనుమానాస్పద పరిస్థితుల్లో

తొరవ 8వ పేజీలో

# పునాదుల్లోనే ప్రారంభోత్సవాలా?

నెల్లూరు ఎమ్పీ డాక్టర్ రాజేశ్వరమ్మకు ప్రారంభోత్సవాల పిచ్చి పట్టుకున్నట్లుంది. ఈ ఉత్సాహంలో పని పూర్తికాని పథకాలను సైతం ఆమె ప్రారంభించేస్తున్నారు. ఆత్మకూరు మండలం బోయిన చిరువెళ్ల గ్రామంలో పక్కా గృహాల నిర్మాణం పూర్తిగాకుండానే 36 గృహాల కాలనీ 12తేది ప్రారంభించేశారు. పిల్లల పార్కు విషయంలో ప్రొటోకాల్ అంటూ అరిచి ఆగిత్తం చేసిన మన ఎమ్పీగారు ఆత్మకూరు కార్యక్రమంలో ఎమ్మెల్యేను ఖాతరు చేయకుండా ఓడిపోయిన వాళ్లు పెట్టిన ప్రభుత్వ కార్యక్రమంలో ఎలా పాల్గొన్నారు ఆమెకే తెలియాలి. ఈ కార్యక్రమాన్ని మాజీ ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడు ఏర్పాటు చేయించారు. అనంతరం ఏర్పాటు చేసిన సభలో ఎమ్పీ మాట్లాడుతూ తన చేతుల మీదుగా కాలనీని ప్రారంభించిన దృష్ట్యా కాలనీ అభివృద్ధికి శాయశక్తులా ప్రయత్నిస్తానన్నారు. ఆత్మకూరు, ఉదయగిరి, వింజమూరు వాసులు గ్యాస్ కావాలంటే నెల్లూరు నుండి తెచ్చుకోవాల్సి రావడంతో వారు పడుతున్న కష్టాలను కేంద్ర మంత్రికి వివరించగా, ఆయన ఆత్మకూరులో గ్యాస్ ఏజన్సీకి గ్రీన్ సిగ్నల్ ఇచ్చినట్లు చెప్పారు. తమ గ్రామంలో ఫోన్లు కావాలనుకొనే వారు కనీసం 50 మంది ఒక జట్టుగా ఏర్పడి

### 'ఉక్కాల' వారి అత్యుత్సాహం!

దరఖాస్తు చేస్తే, తాను ఎక్స్ఛేంజీలు ఏర్పాటు చేయిస్తానన్నారు. మాజీ ఎమ్మెల్యే కొమ్మి లక్ష్మయ్యనాయుడు మాట్లాడుతూ ఎమ్మెల్యే బొల్లినేని కృష్ణయ్య తానేదో ఆత్మకూరు రైతులకు సహాయపడుతున్నానని ప్రకటనలు చేస్తున్నాడని, ఆయనలో చిత్తశుద్ధి వుంటే సోమశిల ఉత్తర కాల్వ పూడిక తీతకు ట్రాక్టర్లు ఇవ్వాలని

తొరవ 8వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

విశ్లేషకుడు

## విద్యుత్ దీపాలనార్పి నిరసన

విద్యుత్ ఛార్జీల పెంపుదలను వ్యతిరేకిస్తూ నెల్లూరు టౌన్ ప్రజలు వినూత్న రీతిలో నిరసన తెలియజేస్తున్నారు. 11, 12, 13తేదీల్లో సంతపేట, ఎన్టీఆర్‌నగర్ ప్రాంతీయులు రాత్రి 7 గంటల నుంచి 8 గంటల వరకు తామే స్వచ్ఛందంగా విద్యుత్ దీపాలన్నీ ఆర్పిన నిరసన తెలియజేశారు. జనశక్తి నగర్‌వాసులు ఇళ్లపై నల్ల జెండాలు ఎగురవేసి తమ ఆగ్రహం వ్యక్తం చేశారు. 32వార్డు పరిధిలోనికి వచ్చే బృందావనం, శంకరాగ్రహారం, గాంధీనగర్, కస్తూరిదేవినగర్, పొగతోట, సోమశేఖరపురం ప్రాంతీయులు 'ఈ ఇంటిలోవున్న మేము పెంచిన విద్యుత్ ఛార్జీలను నిరసిస్తున్నామన్న' నినాదంతో కూడిన పోస్టర్‌ను తమ సంతకంతో ఇళ్ల ముందు అతికించారు. ఈ పోస్టర్ తయారీకి అయిన ఖర్చు ఒక్క రూపాయిని కరెంట్ ఛార్జీల పెంపుదల వ్యతిరేక సమితి సభ్యులకిచ్చి దీన్ని ప్రజలు కరిపించడం పొడుమనాలి. టౌన్‌లోని పలు ప్రాంతీయులు పెంచిన విద్యుత్ ఛార్జీలను ఉపసంహరించాలని ముఖ్యమంత్రిని కోరుతూ సంతకాలు చేసిన విజ్ఞప్తులు పంపారు.

టౌన్‌లో ఈ నెల విద్యుత్ బిల్లుల పంపిణీ ఒకసారి చేస్తే ప్రజల్లో నిరసన పెల్లుబుకుతుందని ఆ శాఖాధికారులు తలపోస్తున్నారు. బిల్లులు కట్టేందుకు తుది గడువు 14తేదీ దాటిపోతున్నా, నగర టౌన్‌లో ఎక్కువ భాగం బిల్లులు పంపిణీ చేయలేదు. ప్రజలకు పంపించేందుకు ప్రభుత్వం రకరకాల ఎత్తులు వేయడం అన్యాయం, అక్రమం.

## అతిసార వ్యాధి విజృంభణ

నెల్లూరు టౌన్‌లో అతిసార వ్యాధి ఒక్కసారిగా విజృంభించింది. దీని మూలంగా అయ్యే విరోచనాలతో వందలాది మంది పిల్లలు ప్రభుత్వ, ప్రైవేటు ఆసుపత్రుల్లో చేరడంతో అవి కిటకిటలాడుతున్నాయి. స్టోన్‌హౌస్‌పేట రేబాల వారి వీధిలోని ప్రభుత్వ చిన్న పిల్లల ఆసుపత్రిలో 45 మంది పిల్లలు అతిసార వ్యాధిసోకి అడ్మిట్ అయి ఉన్నారంటే, మిగతా ఆసుపత్రుల్లో వీరి సంఖ్య ఎంత మేరకుం టుందో ఊహించుకోవచ్చు. వెంకటేశ్వరపురం, వెంగళరావునగర్ ప్రాంతాల్లోని ఎక్కువ మంది పిల్లలు ఈ వ్యాధి బారిన పడ్డారు.

ఈ వ్యాధి విజృంభణకు మునిసిపాలిటీ నిర్లక్ష్యమే కారణం. ఈ వ్యాధి పిల్లలను కబళించినప్పుడు తప్ప మిగతా సమయాల్లో మంచినీటి ట్యాంకుల పరిశుభ్రం, పైపులైన్ల లీకేజిని పట్టించుకోక పోవడం దారుణం. ఇప్పటికైనా మునిసిపల్ ఆరోగ్య శాఖ మేలుకొంటే మంచిది.

## సోమశిల జలాలతో చెరువులు నింపరా?

ఇటీవల కర్నూల్, కడపజిల్లాలలో కురిసిన వర్షాలకు సోమశిలలో 25 టిఎంసిల నీళ్లు వచ్చి చేరాయి. కాని ఈ నీటిని జిల్లా ప్రజలు వ్యవసాయపనులు ప్రారంభించు కొనేందుకు నీటిపారుదల శాఖాధికారులు వదలడం లేదు. జిల్లాలోని చెరువులన్నీ ఖాళీగా పెట్టి కండలేరు ప్రాజెక్టుకు రోజుకు 1500 క్యూసెక్కుల వంతున నీటిని తరలిస్తున్నారు. వాస్తవంగా కృష్ణ మిగులు జలాలు, సోమశిల చేరితే వాటిని కండలేరుకు విడుదల చేయాలి. కాని దీనికి విరుద్ధంగా జిల్లా ప్రజలు తొలుతవాడు కోవాల్సిన సోమశిల జలాలతో కండలేరును నింపడం వెనుక దుష్ట ఆలోచన దాగుందనాలి. కండలేరు నుంచి నీటిని మళ్లీ మద్రాసు, తిరుపతిలకు పంపాలని ఎత్తుగడ వేసినట్లుంది తెలుగుదేశం ప్రభుత్వం.అందువల్ల రాష్ట్రంలోని అన్ని ప్రాజెక్టుల పరిధిలోని కాల్వలకు నీటిని విడుదల చేసే తేదీలను భారీ నీటిపారుదల శాఖా మంత్రి మండవ వెంకటేశ్వరరావు 12తేదీ ప్రకటించారు. కాని పెన్నార్ డెల్టా విషయాన్ని మాత్రం తర్వాత ప్రకటిస్తానన్నారు. ఈ యేడాది మార్చిలో సోమశిలలో 18 టిఎంసిల నీళ్లున్నా కుంటిసాకులు చూపి రెండవ పంటకు నీళ్లివ్వలేదు. ఈసారి వ్యవసాయ పనులకు ముందుగానే నీటిని విడుదల చేస్తామని చెప్పి జిల్లా రైతులను దగా చేయాలని చూస్తున్నట్లుంది. ఈ విషయంలో రైతు సంఘాలు, రాజకీయ పార్టీలు ప్రజలను జాగృతం చేయాల్సి వుంది.

నెల్లూరులో స్పాస్టిక్ సెంటర్‌ను ప్రారంభిస్తున్న అప్పటి కలెక్టర్ శ్రీలక్ష్మి, ప్రక్కన జె.కె. రెడ్డి, మాగుంట పార్వతమ్మ, వివేకానందరెడ్డి వున్నారు.

## శ్రీరామమూర్తిగారి సంస్మరణ

జమీన్‌రైతు జీవప్రదాత స్మృతియ నెల్లూరు శ్రీరామమూర్తి గారు స్వర్గస్తులై అప్పుడే ఏడు సంవత్సరాలు నిండాయి. వారి సప్తమ వర్థంతి 20.7.2000.

జమీన్‌రైతు పత్రిక వున్నంత కాలం శ్రీరామమూర్తిగారు చిరంజీవి. ఆయనను సంస్మరించుకొంటూ జోహార్లు అర్పించుకుంటున్నాము.

... జమీన్‌రైతు కుటుంబం

## నెల్లూరా - పల్లెటూరా?

నెల్లూరు ఏసి నగర్ ప్రాంతంలో 13తేదీ పర్యటించిన ఎమ్పీ డాక్టర్ వుక్కాల రాజేశ్వరమ్మ ఈ వార్త పత్రికలో పేర్కొన్న సందేహం కలిగింది. నెల్లూరు టౌన్ కన్నా పల్లెటూళ్లే బాగున్నాయని వ్యాఖ్యానించి, ఈ పరిస్థితి మారేందుకు తన చేతనైన సహాయం చేస్తానన్నారామె. టౌన్‌లో సరికొత్త డ్రైనేజి నిర్మాణానికి మునిసిపాలిటీ ప్రతిపాదనలు రూపొందిస్తే కేంద్ర ప్రభుత్వం నుంచి తాను గ్రాంటు సాధించి తెస్తున్నారు. టౌన్‌లోని ప్రతి వార్డుల అభివృద్ధికి తన ఎమ్పీ గ్రాంటును కూడా వెచ్చిస్తానన్నారామె. అనురాధ గారు... ప్రతిపాదనలు రూపొందించి ఆ పైళ్లను ఎమ్పీ చేతికి ఎంత త్వరగా ఇస్తే అంత మంచిది.

## ఏ గ్రేడ్ స్టేషన్‌గా నెల్లూరు రైల్వే స్టేషన్

నెల్లూరు రైల్వే స్టేషన్‌ను రైల్వే మంత్రిత్వ శాఖ ఎగ్రేడ్ స్టేషన్‌గా గుర్తించింది. దీని మూలంగా రైల్వే స్టేషన్ అభివృద్ధికి మరిన్ని నిధులు మంజూరవుతాయి.

## డిఎస్‌సి దరఖాస్తుల కొరత

టీచర్ల రిక్రూట్‌మెంట్ కొరకు ప్రభుత్వం నిర్వహిస్తున్న డిఎస్‌సికి దరఖాస్తు చేయను, అభ్యర్థులకు దరఖాస్తుల కొరత ఏర్పడింది. 10 తేది నుంచి నెల్లూరు, కావలి, గూడూరులలోని ప్రధాన పోస్టాఫీసుల్లో ఈ దరఖాస్తులు విక్రయిస్తామని విద్యాశాఖాధికారులు ప్రకటించారు. కాని నెల్లూరు టౌన్‌లో మొదటి రోజు వెయ్యి దరఖాస్తులిచ్చి పోస్టల్ అధికారులు చేతులెత్తేశారు. రెండవరోజు స్కూల్ అసిస్టెంట్ పోస్టుల దరఖాస్తులుంటే, సెకండరీ గ్రేడ్ పోస్టుల దరఖాస్తులులేవు. మూడవరోజు కూడా ఇదే పరిస్థితి. జిల్లాలో 8వేల మంది బియిడి సెకండరీ గ్రేడ్‌పోస్టులకు దరఖాస్తు చేయను అర్హులుంటే, రెండు మూడు వేల దరఖాస్తులు విద్యాశాఖాధికారులు పంపితే ఎలా? దీనికితోడు ఈ దరఖాస్తుల నింపే విధానం కూడా మరీ కఠినంగా వుంది. చిన్న అక్షరం తప్పుపోయినా, దాన్ని సరిచేసినా దరఖాస్తులను తిరస్కరించడం దారుణం. ఈ విధానం వల్ల గ్రామీణ ప్రాంతాల నుంచి దరఖాస్తు చేయను వచ్చిన నిరుద్యోగులు వ్యయప్రయాసలకు లోనవు తున్నారు.

దరఖాస్తు స్వీకరణ కేంద్రంలో వున్న అధికార్లు కూడా వీటిని స్వీకరించేందుకు పలు సందేహాలొస్తున్నాయట. విద్యాశాఖాధికారుల కథనం మేరకు 13తేదీ వరకు భారతీదాసన్, అలగప్ప యూనివర్సిటీల్లో బియిడి పూర్తి చేసిన అభ్యర్థుల దరఖాస్తులు మాత్రం తిరస్కరి స్తున్నారు. ప్రతి రోజూ హైదరాబాద్ నుంచి కొత్త ఫ్యాక్స్ సందేశాలు వస్తుండడంతో

తరువాయి 7వ పేజీలో

# నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ తరువాయి

పర్యాటకాధికారులు తల బొప్పికట్టి పోతుంది. డిఎస్సీ రిక్రూట్‌మెంట్ పూర్తయ్యే సరికి దీనికి చెత్త పేరుకున్న ఆ నాలుగో వెంట్రుకలు కూడా ఊడిపోయే ప్రమాదం వున్నందున ఆయన జాగ్రత్తగా వుండడం మంచిది.

## బిజెపి చేనేత సెల్‌లో నెల్లూరీయుడు

భారతీయ జనతాపార్టీ చేనేత సెల్ రాష్ట్ర జాయింట్ కన్వీనర్‌గా నెల్లూరీయుడు కె.ఎన్. చక్రధర్‌ని, ఆ పార్టీ రాష్ట్ర నేత చిలకం రామచంద్రారెడ్డి నియమించారు. చక్రధర్ గతంలో బిజెపి జిల్లా చేనేత సెల్ కన్వీనర్‌గా పనిచేశారు.

## గూడూరు మానసిక వ్యాధుల ఉచిత శిబిరం

నెల్లూరులోని సాయి సత్యహాస్పిటల్ నేతృత్వంలో గూడూరు మిట్టపాళెంలోని విశ్వభారతి ఇంగ్లీష్ మీడియం స్కూల్‌లో 16వతేదీ ఉచిత వైద్య శిబిరం ఏర్పాటు చేస్తున్నారు. శిబిరంలో డాక్టర్ డి.సత్యనారాయణ, డాక్టర్ డి. సత్యశ్రీ మానసిక, నరాల, మూర్ఛ, ఆస్తమా, అలెర్జీ, నెమ్ము వ్యాధిగ్రస్తులను ఉచితంగా పరీక్షించి, మందులిస్తారు. ఈ శిబిరాన్ని ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ ప్రారంభిస్తారు. ముఖ్య అతిధులుగా ఎన్‌డిపిఓ ఎస్‌జె జనార్ధన్, ఛైర్మన్ కల్పలత, డాక్టరు సి.ఆర్.రెడ్డి, కె.వి.నరసింహం పాల్గొంటారని పర్యవేక్షకులు వెంగలరాజు తెలియజేస్తూ, ప్రజలు ఈ అవకాశాన్ని వినియోగించుకోమంటున్నారు.

## డిఎస్‌సి పరీక్షలకు ఉచిత శిక్షణ

టీచర్స్ రిక్రూట్‌మెంట్ కోసం ప్రభుత్వం నిర్వహించే డిఎస్సి - 2000 పరీక్షలకు హాజరయ్యే వారికి ఆంధ్రప్రదేశ్ ఉపాధ్యాయ సంఘం - (ఆపస్) నెల్లూరు జిల్లా శాఖ ఉచిత శిక్షణా తరగతులను నిర్వహిస్తుంది. 16వతేదీ ఈ తరగతులు ప్రారంభమవుతాయి. ఇతర వివరాలను జయభారత్ హాస్పిటల్ వద్దగల ఆపస్ కార్యాలయంలోగాని, 314076, 311114 నెంబర్లకు ఫోను చేసిగాని తెలుసుకోవచ్చు. పోటీ పరీక్షలకు కోచింగ్ సెంటర్లలో విపరీతంగా ఫీజులు పెరిగిపోయిన రోజుల్లో పేద, మధ్యతరగతి కుటుంబాలలోని విద్యార్థుల కోసం ఆపస్ చేస్తున్న కృషి అభినందనీయం.

## అదనపు చక్కెర

చౌకధరల దుకాణాల ద్వారా ప్రతి నెల ఇచ్చే చక్కెర తోపాటు అదనంగా మరో కిలో చక్కెర ఇచ్చేందుకు ప్రభుత్వం 631 టన్నుల చక్కెరను విడుదల చేసింది. జిల్లాలోని అన్ని రంగుల కార్డుల వారు ఈ అవకాశాన్ని వినియోగించుకోమని జాయింట్ కలెక్టర్ కాశ్మీయేల్ తెలియజేస్తున్నారు.

## సాయి మొబైల్స్ ప్రారంభం

ఎలక్ట్రికల్ గృహోపకరణాల రంగంలో తిరుగులేని సాయినాథ్ అండ్ కో నిర్వాహకుడు ప్రత్తి నరసింహులు శెట్టి, కొత్తగా సెల్ ఫోన్ల వ్యాపారం ప్రారంభించారు. వహాబ్‌పేటలో హోటల్ సూర్య ప్రక్కన కొత్తగా పెట్టిన సాయి మొబైల్స్ ఎయిర్ సెల్ కనెక్ట్ షోరూంను 8వతేదీ భారతి మొబైల్స్ లిమిటెడ్ సేల్స్ విభాగం ఉపాధ్యక్షుడు ఎస్. మురుగేష్ ప్రారంభించారు. ఎమ్మెల్యే బ్రదర్స్ వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డి, మాజీ ఎమ్మెల్యే జకె.రెడ్డి ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు. సెల్ ఫోన్ల వ్యాపారంలోనూ తిరుగులేని రికార్డును నరసింహులు శెట్టి నెలకొల్పాలని మనసారా కోరుకొంటున్నాం.

## కావలికి కొత్త ఆర్డీఓ

కావలి ఆర్డీఓగా కె.మస్తానరావు 12వతేదీ బాధ్యతలు చేపట్టారు. పులివెందులలో డిప్యూటీ కలెక్టరుగా పనిచేస్తూ ఇక్కడకు బదిలీ అయ్యారు.

## ములుమూడిరోడ్డు అధ్వాన్నం!

నెల్లూరు నుంచి ములుమూడికి వెళ్లే రోడ్డు మరీ అధ్వాన్నంగా తయారయ్యింది. దీంతో ఈ రోడ్డుపై ప్రయాణం ప్రమాద భరితమయ్యింది. నెల్లూరుటౌన్ పడమర సరిహద్దులో వున్న ఇరుగాలమ్మ గుడి వద్ద నుంచి కిలోమీటర్ మేర సంవత్సరం క్రితం కంకర పరచి వదిలేశారు. ఈ రోడ్డుపై వాహనాలు వెళ్తూ పంక్చర్ అయిపోతున్నాయి. జొన్నవాడ బ్రిడ్జి వద్ద క్రాసింగ్ దాటి దిగాక నరసింహకొండ వద్ద నుంచి లాలిపర్తి వెళ్లేవరకు ఈ రోడ్డుపై ప్రయాణం నరకాన్ని గుర్తుకు తెస్తుంది. పెద్ద పెద్ద గుంటలతో రోడ్డు పూర్తిగా దెబ్బతిని పోయివున్నా వీటిపై కట్ట కంకర కూడా వేసేందుకు ఆర్‌అండ్‌బి అధికారులకు తీరిక లేకపోయింది. ఆర్టీసి బస్సులెక్కిన నరసింహకొండ, ములుమూడి, సౌతమోపూరు, వెల్లంటి, గొల్లకందుకూరు, సజ్జాపురం, లాలిపర్తి ప్రజలు అటుఇటూ ఊగుతూ బస్సు దిగేసరికి వళ్లు హూనమై పోతుంది. ఈ బస్సు లెక్కిన ఎంతో మంది గర్భిణులకు ఆసుపత్రికి వెళ్లకుండానే కాన్పు అయ్యేందుకు మొత్తానికి ఈ రోడ్డు ఉపయోగపడుతుంది. ఈ రోడ్డు పునర్నిర్మించే విషయమై ప్రజాప్రతినిధులు శ్రద్ధ చూపితే బాగుంటుంది.

## పెన్నలో శవదహనశాల

ఎండా, వానా కాలంలో పెన్నలో శవదహనానికి నెల్లూరీయులు పడుతున్న బాధ అంతింత కాదు. ఈ విషయాన్ని మునిసిపాలిటీ పట్టించుకోకపోయినా జీవిత్యు నిగా నెల్లూరీయులకు సుపరిచితుడైన సురభిరామయ్య స్పందించి స్వయంగా, తన స్వంత డబ్బులు వెచ్చించి శవదహనశాలను నిర్మించారు. దీనిలో ఒకేసారి రెండు శవాలను కాల్చే వసతి వుంది. ఇప్పటికే ఎన్నో ప్రజా సమస్యల పరిష్కారానికి స్వంత ధనాన్ని వెచ్చించి సురభి రామయ్యకు దైవం పూర్ణాయుష్షును ప్రసాదించాలని మనసారా కోరుకొంటున్నాం.

# సంస్మరణ



జననం
28.8.1948



మరణం
16.7.1998

మా తండ్రి

## పోతిరెడ్డి సుబ్బారెడ్డి గారు

| | |
|---|---|
| చల్లని చూపులు మాపై నిలిపి | భౌతికంగా వారు లేకపోయినా |
| ఎల్లవేళలా అండగా నిలిచి | వారి ఆశీస్సులు మాకుంటాయి దండిగా మెండుగా |
| పిలువకనే పలికే | ఆ ఆశీస్సుల బలంతో ముందడుగు వేస్తూ |
| మా పాలిటి దేవుడు | వారి ఆశయాల బాటలో పయనిస్తూ |

16.7.2000 తేది ద్వితీయ వర్ధంతి సందర్భంలో వారిని సంస్మరించుకుంటూ
వారి ఆత్మకు చిరశాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తూ ..

అశ్రునయనాలతో

**పోతిరెడ్డి శ్యామసుందరరెడ్డి ● పోతిరెడ్డి అనిల్‌కుమార్‌రెడ్డి**

తల్లి : రుక్మిణమ్మ భార్య : శారద అత్త : తిరుమూరు కృష్ణవేణమ్మ

బావమరుదులు : టి.ఎల్. ప్రసాద్‌రెడ్డి ... జయశ్రీ (USA)
టి. వరదారెడ్డి ... మల్లీశ్వరి (USA) టి. కృష్ణారెడ్డి

తోడల్లుళ్లు : శ్రీమతి శ్రీ రమణారెడ్డి శ్రీమతి శ్రీ సిద్దారెడ్డి

— తోడల్లుడి కుమార్తెలు .. అల్లుళ్లు —

సుధామాధురి ... వెంకటకృష్ణారెడ్డి K. (USA) మౌనిజ ... శ్రీధర్‌రెడ్డి M.
నలుబోలు శ్రీధర్‌రెడ్డి ... జ్యోతి S. వెంకటేష్‌రెడ్డి S. శ్రీనివాస్‌రెడ్డి

# అత్యద్భుత వాస్తు సిరి - తాజ్‌మహల్!

స్వచ్ఛమైన అజరామరమైన ప్రేమకు నీరాజనం తాజ్‌మహల్ ప్రపంచ ప్రఖ్యాత అపురూప కళా ఖండం తాజ్‌మహల్ అద్భుత శిల్పకళా విన్యాసాలకు నెలవై, పాలరాతి ధగధగలకు కొలువై యాత్రికుల మనోమందిరాల్లో ప్రతిష్ఠించుకున్న అద్భుత సజీవ చిత్రం తాజ్‌మహల్.

షాజహాన్ తన ప్రియ పత్ని ముంతాజ్ సమాధి చుట్టూ భారతీయ, పారశీ శిల్పకళా శైలి విన్యాసాలతో పాలరాతితో మహల్‌ను నిర్మించారు. ఆగ్రాలో యమునానదీ తీరంలో ఈ నిర్మాణం జరిగింది.

దాదాపు 370 సంవత్సరాల క్రితం ఈ నిర్మాణం జరిగింది. ప్రపంచంలోని ఏడు వింతల్లో ఈ నిర్మాణం ఒకటి అయింది. నేటికీ తన అందాలతో చూపరులను ఆశ్చర్యపరుస్తోంది. నేటికీ లెక్కలేనన్ని లక్షలాది యాత్రికుల్ని ఆకర్షిస్తూ వుంది. అందుకు తాజ్‌మహల్ వాస్తుగిరి, చరిత్రలేమిటో చూద్దాం.

చరిత్రలో ఎంతో వివాదాస్పదుడైనప్పటికీ అపురూపమైన కళాభిమాని షాజహాన్. షాజహాన్ క్రీ.శ. 1592 జనవరి 5వ తేదీ లాహోర్‌లో జన్మించారు. ఇతడు జహంగీర్ మూడవ కుమారుడు. అసలు పేరు 'ఖుర్రం'. ఇతను జన్మించినప్పుడు ఈయన తాత అయిన అక్బర్

## వాస్తుసంగతులు

ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి

మనవణ్ని చూడటానికి లాహోర్ వెళ్లారు. అక్బర్‌కు అంతటి ప్రియమైనవాడన్నమాట షాజహాన్. షాజహాన్ తండ్రి జహంగీర్ లాహోర్, కాశ్మీర్‌లకు మధ్య 'రాజౌరీ' అనే ప్రాంతంలో క్రీ.శ. 1627 అక్టోబరు 28వ తేదీన ఉబ్బసం వ్యాధి తీవ్రతతో మరణించారు.

అంతకు ముందు షాజహాన్ పెద్దన్న ఖుస్రూ విషప్రయోగం చేత మరణించాడు. వారసత్వ కలహాలలో విజయం సాధించిన షాజహాన్ క్రీ.శ. 1628 ఫిబ్రవరి 14వ తేదీన పట్టాభిషిక్తుడయ్యాడు.

అప్పటికి షాజహాన్ దాదాపు '36 సంవత్సరాల వయసువాడు. అంటే ముంతాజ్ బేగంతో అంతకు పూర్వమెప్పుడో వివాహం జరిగి వుండాలి.

తాజ్‌మహల్ నిర్మాణాన్ని షాజహాన్ క్రీ.శ. 1632లో ప్రారంభించాడు. అంటే పట్టాభిషేకం జరిగిన నాలుగు సంవత్సరాలకు ఈ నిర్మాణం ప్రారంభమయ్యింది. అలాగే బహుశా క్రీ.శ. 1632లో ముంతాజ్ బేగం మరణించి వుండాలి.

ఆమె స్మృతి చిహ్నంగా అపురూప కట్టడం నిర్మించాలని సంకల్పించారు షాజహాన్. ఈ నిర్మాణ పథకానికి పర్షియా, అరేబియా, పారశీక ఇంజనీర్లెందరో వచ్చారు. వెనిస్ రాష్ట్రీయుడు 'శ్రీ గెరోనియా వెర్రోనియో' ఇచ్చిన ప్లాను షాజహాన్‌కు వాగా నచ్చిందట.

ఈ నిర్మాణానికి 'ఉస్తాద్ ఇశా' వాస్తు శిల్పి. అతని నెలజీతం అప్పట్లో వెయ్యి రూపాయలు. తాజ్‌మహల్ హుమాయూన్ గోరీ కళావిన్యాసాలను పుణికి తెచ్చుకుందని చరిత్రకారులు చెబుతారు.

గోరీ వేదిక పొడవు 100 మీ. వెడల్పు అంతే. దీర్ఘ చతురస్రాకార మన్నమాట. గోరీ వేదిక తర్వాత గోరీ వైశాల్యం పొడవు వెడల్పులు 56.7 మీటర్లు. ఎత్తు 6.7 మీటర్లు.

తాజ్‌మహల్ నిర్మాణానికి వాడిన చలువరాతిని రాజస్థాన్ 'మక్రానా' గనుల నుంచి తెప్పించారు.

క్రీ.శ. 1632లో ప్రారంభించిన తాజ్‌మహల్ క్రీ.శ. 1653కు పూర్తి అయింది. ఈ నేపథ్యంలో ఇట్లాంటి అపురూప కళా ఖండాన్ని మరెక్కడా కట్టడానికి వీల్లేదని షాజహాన్ ఆ నిర్మాణంలో పాల్గొన్న పనివాళ్ల చేతుల్ని ఖండించారని చెబుతారు. అది ఎంత వరకు నిజమో తెలియదు.

ఢిల్లీలోని ఎర్రకోట, ప్రస్తుతం బ్రిటిష్ మ్యూజియంలో వున్న 'నెమలి సింహాసనం' షాజహాన్ నిర్మాణాలే!

'మయూర సింహాసనం' ప్రస్తుత ఖరీదు 20కోట్లని నిపుణులు చెబుతున్నారు.

### అద్భుత వాస్తు సిరి!

హంపి విషయమే చూడండి. మహమ్మదీయుల దాడులకు అన్ని ఆలయాలూ నాశనమయ్యాయి. ఒక్క విరూపాక్ష దేవాలయం తప్ప. అందుకు ఆ ఆలయానికున్న వాస్తు బలమే ప్రధాన కారణం. అలాగే తాజ్‌మహల్ కూడా!

మొత్తం దీర్ఘచతురస్రంగా వుండి నాలుగు మూలలా సమతూకపు కట్టడాలు వుండటం వల్ల 'సమతుల్య స్థితి' ఏర్పడింది. ఇది భవనానికి ఒక ప్లస్ పాయింట్.

దిక్సూచికి సరిగా కట్టడం అమరింది. ఏ దిక్కులలోనూ యాంగిల్స్ పెరగలేదు. ఇందువల్ల 'దిక్ ప్రలోభస్థితి' లేకుండా పోయింది. నిర్మాణంలో తాజ్‌మహల్ దక్షిణ, పశ్చిమాల్లో తక్కువ స్థలాన్ని మిగుల్చుకొని తూర్పు, ఉత్తరాల్లో విశాలమైన స్థలాన్ని పొందింది. ఇది 'వాస్తు అత్యున్నత స్థితికి' కారణమయ్యింది.

అనుకోనివిధంగా దక్షిణ ద్వారాలు సమున్నతంగానూ, ఉత్తర ద్వారాలు పల్లంగాను అమరాయి. ఇందువల్ల యమస్థానం, వరుణస్థానం బలహీనపడి కుబేరస్థానం 'ఉన్నతస్థితి'ని పొందింది. ఈ కారణం వల్ల భవనం ఉపద్రవాలకు లోనుకాలేదు. అన్నిటికన్నా మించి యమునానది తాజ్‌మహల్‌కు ఉత్తరవాహిని అయింది. ఉత్తరం నుంచి తూర్పుకు ప్రవహిస్తోంది. ఇందువల్ల ఈశాన్యస్థితి సమున్నతమైంది. ఈశాన్యం 'అత్యున్నతస్థితి'ని అందుకొంది. ఫలితంగా ఎన్ని చిన్న అవాస్తులున్నా ఈ భవంతి దేదీప్యమానంగా వెలుగుతోంది. షాజహాన్ ప్రేమ చిహ్నమైనా, భారతీయ సంస్కృతికి నిలువుటద్దమై చరిత్రలో 'స్వర్ణాధ్యాయ'మయి పరిఢవిల్లుతోంది. •

## తిరగని మీటర్లు

5వ పేజీ కొరవ

మరణించిన వరికుంటపాడు మండలం నల్లబోతులవారి పల్లెకు చెందిన తమ్మిరెడ్డి రత్నమ్మ కేసును పోలీసులు ఛేదించారు. ఈ నెల నాల్గవతేదీ సాయంత్రం కొందరు వ్యక్తులు దారికాచి రత్నమ్మను అత్యాచారం చేసి, హత్య చేశారు. ఈ కేసు వెనుక దాగిన మిస్టరీని సి.ఐ. శ్రీనివాసరావు 10వతేదీ విలేఖరులకు వివరించారు. హతురాలు రత్నమ్మ కంకరకొట్టి జీవనం సాగించేదని, 4వ తేదీ ఈ పని ముగించుకొని సమీప బంధువు దేవండ్ల తిరుపతమ్మతో కలిసి వస్తుండగా మార్గ మధ్యంలోని పాటి మీద మామిడి దొడ్డి వద్ద చీమలదిన్నె మాల్యాద్రి, మద్దినేని చినవెంకటయ్య మరో ఇద్దరు కలిసి రత్నమ్మను అటకాయించి సామూహిక అత్యాచారం జరిపి, అనంతరం మెడనరికి హత్య చేశారు. కాని సంఘటన ప్రత్యక్ష సాక్షి తిరుపతమ్మ భయంతో అసలు విషయాన్ని దాచిపెట్టిందని తదుపరి మూడు రోజులకు జరిగిన సంఘటన ఇందులో పాల్గొన్న వ్యక్తుల పేర్లు తెలిపిందన్నారు. అత్యాచారం చేసే సమయంలోనే రత్నమ్మ మృతి చెందగా, ఈ సంఘటనలో పాల్గొన్న వ్యక్తులు నగల కోసం దారి కాచి మెడనరికినట్లు చిత్రీకరించేందుకు కూడా పథకం వన్ని హతురాలి మంగళ సూత్రం, చెవి దిద్దులు కూడా పట్టుకపోయారు. చీమలదిన్నెకు చెందిన మాల్యాద్రి అనే యువకుడ్ని అదుపులోనికి తీసుకొని అతని వద్ద నుంచి ఈ చెవి దిద్దులను కూడా స్వాధీనం చేసుకొని కోర్టులో హాజరు పర్చినట్లు సిఐ చెప్పారు. మిగిలిన ముగ్గురి కోసం ప్రత్యేక పోలీసు దళాలతో గాలింపు చర్యలు చేపడుతున్నట్లు త్వరలోనే వారిని అరెస్ట్ చేస్తామన్నారు. ఈ హత్య జరిగాక ఒకటి, రెండు రోజులు పోలీసులు దర్యాప్తు ఆలస్యం చేసే సరికి వారి వైఖరిపై అనుమానాలు బయలుదేరాయి. తర్వాత సిఐ ఈ కేసుపై ప్రత్యేక శ్రద్ధ చూపారు.

విద్యుత్ ఛార్జీల పెంపుదలను నిరసిస్తూ రాష్ట్ర మహిళా కాంగ్రెస్ హైదరాబాద్‌లో నిర్వహించిన ర్యాలీలో ఆ విభాగం అధ్యక్షురాలు గల్లా అరుణతో నెల్లూరు నేతలు నేదురుమల్లి రాజ్యలక్ష్మమ్మ, పనబాక లక్ష్మి, పందిళ్లపల్లి అరుణమ్మ తదితరులు.

తీసుకోవాలన్నారు. ప్రతిరోజు ఉదయం 7 గంటల నుంచి 11 గంటల వరకు, సాయంత్రం 4 గంటల నుండి 8 గంటల వరకు చౌకధరల దుకాణాలు తెరవాలని, శనివారం సెలవుగా ప్రకటించాలని జెసి కోరారు. జిల్లాలోని కార్డుదారులందరికీ జూన్ నెలకోటా క్రింద అదనంగా ఒక కిలో పంచదార చౌకధరల దుకాణాల ద్వారా పంపిణీ చేసేందుకు చర్యలు తీసుకొంటున్నామన్నారు. సమావేశంలో నెల్లూరు, గూడూరు, ఆర్డీవోలు ఎం. వెంకటేశ్వర్లు, కె. సుబ్రమణ్యేశ్వరరెడ్డి సిపిఐ, బిజెపి కార్యదర్శులు పి. దశరథరామయ్య, గడ్డం లక్ష్మీనారాయణ పాల్గొన్నారు.

## ఉదారం

డా.వై. శ్రీపతిరెడ్డి

*జీతాలు పెరిగాయి ఉద్యోగులకు సౌకర్యాలు ఉచితం*
*ఆర్టీసీ, రైల్వే వాళ్ల ప్రయాణం చిత్తానుసారం*

*ప్రభుత్వోద్యోగులకు రాయితీల పందారం*
*ప్రైవేట్ పనివారికి వర్షంబోజ్ వరదానం*

*ఎల్జీసీలు అలిసిపోతారని ఐదే పని దినాలు*
*ఎఫ్‌సీఐల అవసరాలకు ధాన్యపు గోదాములు*
*బ్యాంకువాళ్ల జల్సాలకు ప్రజల డిపాజిట్లు*

*రాజకీయ నాయకులకు రాజభోగాలు*
*పార్టీ కార్యకర్తలకు భోగసదనాలు*

*కరెన్సీ అచ్చువేస్తే కంటి తుడుపు దాడులు*
*బ్యాంకుల అప్పులెగవేస్తే పైపై విచారణలు*

*తలలు వేరు చేస్తే ముందస్తు బెయిలు*
*దాడులు చేయకుంటే అణాకాణీ జరిమానాలు*

*వీళ్ల వ్యయమంతా భరిస్తుంది ఉదారంగా ప్రభుత్వం*
*ఆదాయానికి ఒక్క వినియోగదారుడే ఆధారం*

## పునాదుల్లో

5వ పేజీ కొరవ

సలహా యిచ్చారు. రికో ఛైర్మన్ పందిళ్లపల్లి సుబ్బారెడ్డి, మార్కెట్ కమిటీ ఛైర్మన్ కంచర్ల శ్రీహరినాయుడు కూడా ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## జిల్లావార్తలు

5వ పేజీ కొరవ

స్థాయిలో జరిగే ఆహార సలహా సంఘం సమావేశపు తేదీల సమాచారం వారం రోజులకు ముందుగా ఆయా మండలాలలోని సభ్యులకు అందేటట్లు చూడాలని ఆయన సూచించారు. అలాగే మండలాలలో వున్న వినియోగదారుల సంఘాలకు చెందిన ఒక సభ్యుడ్ని, మండల సమావేశాలకు ఆహ్వానించాలని అధికార్లను ఆదేశించారు. బహిరంగ మార్కెట్‌లో కిరోసిన్ లభ్యమయ్యే దుకాణాల జాబితాను కూడా సభ్యులకు అందజేసేందుకు తగు చర్యలు

## జూదరుల పనిపడుతున్న రాపూరు ఎస్ఐ

రాపూరు ఎస్ఐ ఖాసిం గ్రామంలోని జూద గృహాలపై దాడులు తీవ్రం చేశారు. సినిమాహాల్ సెంటర్, అరుంధతీయ పాళెం, కమ్యూనిటీ హాల్ వద్ద జూదం ఆడుతున్న పలువుర్ని అరెస్ట్ చేశారు. మండలంలోని ఇతర గ్రామాల్లో జూదంపై పోలీది అందితే, తన సిబ్బంది సహా అక్కడ వుంటున్నారు. అయితే రాపూరులో పెచ్చు పెరిగిపోయిన వ్యభిచారంపై ఇంకా ఎస్ఐ దృష్టి కేంద్రీకరించలేదు.

## నక్షత్రకుల్లా వేధిస్తున్నారు

ఉదయగిరిలో కరవు ఛాయలు తొలగకముందే బ్యాంకర్లు రుణాల బకాయిలకు, విఏఓలు రెవిన్యూ శిస్తు వసూళ్లకు నడుంకట్టారు. ఈ ప్రాంతాన్ని కరవు ప్రాంతంగా ప్రకటించిన ప్రభుత్వమే వివిధ వసూళ్లకు పూనుకోవడాన్ని ప్రజలు విమర్శిస్తున్నారు. వేలాది రూపాయల పెట్టుబడితో సాగుచేసిన పంటలు సాగునీరు లేక ఎండిపోయిన దశలో వ్యవసాయ బావుల్లో చూద్దామన్నా చుక్కనీరు కనిపించని నేపథ్యంలో, ఇన్‌వెల్ బోర్లు వేసుకొనేందుకు కరవు నిధులు విడుదల చేసిన ప్రభుత్వమే ఈ విధంగా వసూళ్లకు వేధింపులను గురిచేయడం భావ్యం కాదంటున్నారు. గ్రామీణ బ్యాంకులు, సహకార పరపతి సంఘాల అధికారులు కార్లు వేసుకొని రైతుల ఇళ్ల ముందుకు వచ్చి దౌర్జన్యాలకు పూనుకోవడాన్ని రైతులు తప్పు పడుతున్నారు. ఆర్డీలు తమకు లక్ష్యాలు విధించారని చెబుతూ విఏఓలు తమను నక్షత్రకుల్లా పట్టి పీడించడంతో ఏం చేయాలో పాలుపోవడం లేదని రైతులు వాపోతున్నారు. జిల్లాలో ఉదయగిరి ప్రాంతంలోని పరిస్థితులను ప్రభుత్వం ప్రత్యేకంగా అర్థం చేసుకొని రుణాల వసూళ్లను వాయిదా వేయాలని రైతులు కోరుతున్నారు.

## వామపక్షాలపై తక్కువ చూపువద్దు!

కరెంట్ ఛార్జీలను తగ్గించాలని ప్రశాంతంగా ఉద్యమాలను చేస్తున్న వామపక్ష కార్యకర్తలను లాఠీలతో అణచాలనుకొనే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రయత్నం నెరవేరదని సిపిఐ(ఎం.ఎల్) నాయకుడు సిరిసిల్ల మాజీ ఎమ్మెల్యే ఎన్వీ కృష్ణయ్య హెచ్చరించారు. 11వతేదీ వెంకటగిరిలో రైతు కూలీ సంఘం ఆధ్వర్యంలో పెంచిన విద్యుత్ ఛార్జీలకు వ్యతిరేకంగా టౌన్‌లో ప్రదర్శన, రెవిన్యూ కార్యాలయం వద్ద ధర్నాను నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ తెలుగుసేన పేరుతో రౌడీమూకలను తయారు చేయాలన్న ముఖ్యమంత్రి నిర్ణయం ఆయన అట్టడుగు ఆలోచన స్థాయిని వెల్లడి చేస్తుందన్నారు. వామపక్షాలను తక్కువ చూపు చూస్తున్న ముఖ్యమంత్రి తన ధోరణిని మార్చుకోవాలని కృష్ణయ్య సలహా యిచ్చారు.

## కావలి రోటరీ క్లబ్‌కు నూతన కార్యవర్గం

కావలి రోటరీ క్లబ్ నూతన కార్యవర్గ ఎన్నికలు ఇటీవల జరిగాయి. ఈ ఎన్నికల్లో అధ్యక్షునిగా నేరెళ్ల జ్వాలారావును; ఉపాధ్యక్షులుగా ప్రొఫెసర్ కె. రాజారెడ్డి, పి. కొండలరావు; కార్యదర్శిగా డాక్టర్ ఎం. శ్రీనివాసులురెడ్డి; సహకార్యదర్శిగా ఎన్వీ. కామేశ్వరరావు; కోశాధికారిగా వి.హజరత్తయ్య ఎన్నికయ్యారు. ఈ సందర్భంగా విశ్వోదయా వ్యవస్థాపకుడు దొడ్ల రామచంద్రారెడ్డిని రోటరీక్లబ్ సన్మానించింది. అనంతరం వెంకటగిరి సంస్థానాధీశుడు సాయికృష్ణ యాచేంద్ర సంగీత గేయధార కార్యక్రమం జరిగింది.

# మనసు ఒకరికి-తనువు వేరొకరికి

మొన్నటి ప్రపంచ సుందరి సుస్మితాసేన్ ప్రేమ, పెళ్లి గురించి కొత్త సిద్ధాంతం చెబుతోంది. మనసు ఇచ్చిన వాడికే తనువు అర్పించాలని, రూలేమీ లేదట. మనసుకు, మనిషి సుఖానికి సంబంధం లేదట. సెక్స్‌దారి సెక్స్‌దే, మనసుదారి మనసుదే. పడక సుఖం పంచుకున్న వాడే ప్రియుడు, భర్త కావాలన్న రూలు లేదట. ప్రేమ - పెళ్లి గూర్చి ఆమె మాట్లాడుతూ ప్రేమించే ఒక వ్యక్తికి సర్వస్వాన్ని అందించాలంటే ఆ వ్యక్తి భర్త కానక్కరలేదంది. హృదయాన్ని పెళ్లి నియంత్రించలేదు. ఒక వ్యక్తిని ప్రేమించడం, ప్రేమించక పోవడమనేది మన ఇష్టం. దానికి వ్యవస్థతో పనేముంది. పిల్లల విషయానికొస్తే నాబిడ్డకు తగిన తండ్రి దొరికాడని భావిస్తేనే నేను పిల్లల్ని కంటాను. దానికి పెళ్లెందుకు పెళ్లి చేసుకొన్నాం. కాబట్టి పిల్లల్ని కందామంటే కానొప్పుకోనంది.

## మాజీ ప్రపంచ సుందరి సుస్మితా బరితెగింపు

## పొట్టితనమే శ్రీరామరక్ష

తాను పొట్టిగా వుండడం వల్ల సినిమా పరిశ్రమలో ఏం నష్టపోలేదని ఆల్ రౌండర్ చంద్రమోహన్ చెప్పారు. పొట్టితనం వల్ల నేను కామెడీ హీరోగా చేస్తే జనం నీరాజనం పట్టారు. చిన్న సినిమాలకు స్వర్ణయుగంలా వున్న రోజుల్లో నేను సంవత్సరానికి పది చిత్రాల్లో హీరోగా నటించాను. ఆ తర్వాత హీరోలకు అన్నగా మరిదిగా చేసినా ఏమి పట్టించుకోకుండా ఆ పాత్ర, దానికి తగిన నటన ప్రదర్శించానా లేదా అని చూశారు. బేసిక్ నా హైట్ నన్ను ఒక ఇమేజ్‌కు పరిమితం కాకుండా చూసింది. ప్రేక్షకులు నా నుంచి ఏదో ఒకటి ఆశించకుండా నేనేం చేసినా బాగుంటుందనే భరోసాతో చూస్తున్నారు. ప్రేక్షకుల్లో ఉనికి పోగొట్టుకోకుండా ఉండాలంటే భవిష్యత్తులో తాతయ్యగా కూడా నటించక తప్పదన్నారు.



పెళ్లిసంబంధం చిత్రంలో సాక్షిశివానంద్

# ఊర్మిళలో తరగని అందాల ఊట

దర్శకుడు రామ్‌గోపాల్‌వర్మ తీసే సినిమాలకు నిర్మాతలు, టెక్నీషియన్ మారొచ్చుగాని హీరోయిన్ మాత్రం సాధ్యమైనంత వరకు మారరు. ఇటీవలే వర్మ దర్శకత్వంలో తయారై విడుదలైన 'జంగిల్' చిత్రంలో హీరోయిన్ ఊర్మిళనే. రామ్‌గోపాల్ వర్మ తన తదుపరి చిత్రాన్ని తన అసిస్టెంట్ దర్శకత్వంలో తీస్తున్నారు. దీనిలోనూ 'జంగిల్' చిత్రంలో జంట ఫర్దీన్ ఖాన్, ఊర్మిళనే. ఈ చిత్రంలో ఊర్మిళ అందాల భామ పాత్ర పోషిస్తే, ఫర్దీన్‌ఖాన్ ఫోటోగ్రాఫర్. ఈ చిత్రంలోనూ ఊర్మిళనే ఎందుకు హీరోయిన్‌గా ఎంపిక చేశారని వర్మను ప్రశ్నిస్తే, ఊర్మిళ ఏ పాత్రలోనైనా ఒదిగిపోతుంది. దీనికి తోడు ఆమె మంచి అందగత్తె. ఆమె అందాలను ఎంతసేపు చూసినా తనివి తీరదట. చూసే కొద్ది చూడాలని పిస్తుందని చెప్పారట. ఈ సినిమాలో హీరోయిన్‌కు కావల్సిన అర్హతలన్నీ ఊర్మిళకున్నాయని సమర్థించుకొన్నారు.

## డబ్బాకొడుతున్న రాంగోపాల్‌వర్మ

## వసుధైక కుటుంబం

చిన్నారి స్నేహం, భారత్‌బంద్, ప్రియతమా, సమరం వంటి చిత్రాల్లో నటించిన రఘును తమిళంలో రెహమాన్ అని పిలుస్తారు. ఒకే నటునికి ఇలా రెండు పేర్లు ఉండడమేమిటని అడిగాను. దానికి ఆయన జవాబు చెబుతూ మా అమ్మ హిందువు, నాన్నగారు ముస్లిం. నేను అబుదాబిలో పుట్టి పెరిగాను. అందుకే నాకు హిందూ, ముస్లింలకు సంబంధించిన రెండు పేర్లు వున్నాయి. మా ఇంట్లో జాతీయ సమైక్యత వెల్లివిరుస్తుందనాలి. నేను గుజరాతీ అమ్మాయిని పెళ్లి చేసుకొన్నాను. మా చెల్లెలు కన్నడ యువకుడ్ని పెళ్లి చేసుకొంది. ఇవన్నీ ప్లస్ పాయింట్ కావడం వల్ల తన కూతురు ఐదు భాషలు మాట్లాడుతుందన్నారు.

## దేవత పాత్ర పట్ల మీనా మక్కువ

హీరోయిన్ మీనాకు చాలా రోజులుగా

తరువ 11వ పేజీలో

# వెండితెర వేగుచుక్క - అడవిచుక్క

"అగ్నిపర్వతం పగిలింది అడవి చుక్క లేచింది" ఈ పాట దాసరి నారాయణరావు దర్శకత్వంలో రూపొందిన "అడవిచుక్క" చిత్రంలో ప్రతిధ్వనిస్తుంది. ఇది పాట కాదు. ఒక చైతన్య నినాదం, ఒక విప్లవ ధ్యేయం. ఒక స్త్రీధార సందేశం. ఒక శక్తిధార విజయ విహారం.

అగ్నిపర్వతం పగిలే వరకు ప్రశాంతంగానే వుంటుంది. పగిలిన తర్వాత ప్రతీకారంగా సెగలు పొగలతో పరిసరాలను ముంచెత్తుతుంది. అలాగే అమాయకంగా వున్న చుక్కమ్మలో ఒక్కసారిగా ఎగసి పొంగెత్తిన ఆవేశం, ఆక్రోశం తీవ్రత దుష్టవిరోధ దౌష్ట్యాన్ని ప్రతిఘటిస్తుంది. తమ శ్రమ ఫలాన్ని, శీలధనాన్ని మృగాల్లాంటి మనుషుల చేతుల్లో కోల్పోయే అభాగ్యస్త్రీల వ్యధలకు, కన్నీటి కథలకు అండగా నిలుస్తుంది. అంత కాలం మూతబడివున్న తన నోటిని విస్ఫోటంగా మారుస్తుంది. ఎంతో కాలం నుంచి అచేతనంగా వున్న తన చేతులను వివిధ ఆయుధాలుగా తీరుస్తుంది. పశువాంఛకు నలిగి బలవుతున్న తన కొంగును బిగిస్తుంది. నారి సారించి పాశుపతాస్త్రాలను సంధిస్తుంది. ముష్టిఘాతాలను ప్రయోగిస్తుంది. పోరాట పటిమతో క్రూరుల కోరలు పెరికి వేస్తుంది. నియంతల రాక్షస చేష్టలను మట్టుబెట్టుతుంది. స్వార్థపరులైన భూస్వాములు విసిరే కత్తుల

## చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

కరకుదనానికి బలైపోతున్న బ్రతుకుల్లో చైతన్య బీజాలు నాటుతుంది. పీడితుల, బాధితుల చీకటి జీవితాల్లో సూర్యోదయాన్ని సాధిస్తుంది చుక్కమ్మ.

ఇంతకూ ఈ చుక్కమ్మ ఎవరు? చిన్ననాటి నుంచి అడవి తల్లిని నమ్ముకొని అమాయకంగా జీవితం సాగిస్తున్న ఒక గిరిజన అమ్మాయి. తెలంగాణా దొరల క్రూర కర్కోటక చర్యలకు సర్వస్వం కోల్పోయిన ఒక అభాగ్యురాలు. ఆమె ప్రాణ సమానమైన అక్కను కామాంధులు పొట్టన బెట్టుకున్నారు. ఆమె తండ్రిని కిరోసిన్ పోసి నిలువునా తగులబెట్టారు. ఆమె పెళ్లి రోజున ఆమె భర్తను నియంతలు లాక్కుపొయ్యారు. అతని తల నరికి తలను దాచి పెట్టి మొండాన్ని విసిరికొట్టారు. పట్టణంలోనైనా న్యాయం జరుగుతుందని అడవిలోంచి తన భర్త మొండెంతో పట్టణానికి పోతుంది. అనాగరికమైన అడవుల్లోనేకాదు, నాగరికమైన పట్టణాల్లోనూ దుర్మార్గుల దౌర్జన్యాలకు స్త్రీలు నిత్యం క్షోభననుభవిస్తున్నారు. అలాంటప్పుడు ఆమెకు న్యాయం ఎక్కడ చిక్కుతుంది? చుక్కమ్మ అంతరంగంలో అంతర్మథనం ప్రారంభమవుతుంది. ఆవేదన, ఆవేశంతో చలించిన ఆత్మ సంఘర్షణ రగులుతుంది. తన అక్కను, తన తండ్రిని, తన భర్తను బలితీసుకున్న దుర్మార్గులను హతమార్చ నిశ్చయించుకొంటుంది.

తరువ 11వ పేజీలో

# వీళ్లేం హీరోలండీ! బాబూ!!

తాను పెళ్లాడిన సుందర్ తప్ప, కలసి నటించిన ఇతర తమిళ హీరోలంతా పనికి మాలిన వాళ్లంది. వాళ్ల చేష్టలు గుర్తుకొస్తే రోత పుడుతోందని దులపరించేసింది హీరోయిన్ ఖుష్బూ. ఈ మధ్య ఒక జర్నలిస్ట్ ఖుష్బూ వద్దకు వెళ్లి, మీరు పెళ్లి చేసుకొని సెటిలయ్యారు కదా? మా పేపరుకు మీ అనుభవాలు రాసివ్వండని అడిగాడట. దీంతో ఖుష్బూ వీళ్లందరి గూర్చి చెప్పడం మొదలు పెడితే, తలలు ఎక్కడ పెట్టుకొంటారో తెలియదు. వీళ్ల ఘన చరిత్రలు ప్రజలు తెలుసుకొని బాగుపడేదేమీ లేదు అంటూ చీదరించుకుంది. ఖుష్బూను హీరోలు ఏం చేసి వుంటారో?

## హీరోల సలహాలు కొట్టివేయ కూడదు!

పద్మాలయా స్టూడియోస్ పతాకంపై హీరోకృష్ణ, మహేష్‌బాబు కలసి నటిస్తున్న చిత్రానికి బి.గోపాల్ దర్శకత్వం వహిస్తున్నారు. షాట్ గ్యాప్ గోపాల్‌తో ముచ్చటిస్తూ ఈ మధ్య వస్తున్న హీరోలు చిత్ర నిర్మాణంలో కలుగజేసుకొంటున్నారనే వాఖ్య వినపడుతుంది. దీనిపై సీనియర్ దర్శకునిగా మీ అభిప్రాయమేమిటని అడిగాను. దీనికి జవాబుగా తప్పులేదు. మనం ఎప్పుడూ పెద్దలు చెప్తుంటేవింటూ ఉంటాం. ఏ సినిమా విజయం సాధించిన సమిష్టి కృషి అని. అది చాలా కరెక్ట్ మరి తను పనిచేస్తున్న సినిమా బాగా రావాలని ఒక పాజిటివ్ దృక్పథంలో ఆ సినిమాలోని హీరో కలగజేసుకొంటే తప్పేమిటి? ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమిటంటే అతను ఆ సినిమా బాగా రావాలని జోక్యం చేసుకొంటున్నాడు. హీరోల మీద ఎన్నో ఆశలుంటాయి. వాళ్లు దీన్ని

## హైదరాబాదు సినిమా వార్తలు

నిలబెట్టుకోను జోక్యం చేసుకోవడం తప్పు కాదనేది తన అభిప్రాయమన్నారు గోపాల్.

## మళ్లీ తల్లి కాబోతున్న శ్రీదేవి

మళ్లీ సినిమాల్లో నటించాలను కొని, 'మేరీ బీబీకా జవాబ్ నహీ' సినిమా షిఫ్ట్ రెడీ చేసుకొన్న శ్రీదేవికి మళ్లీ ఆటంకం వచ్చి పడింది. ఆమె మళ్లీ తల్లి కాబోతుండడంతో ఆ చిత్రంలో నటించడని బోనీకపూర్ ఆఫీసు పేర్కొంది.

# వారఫలాలు

15-7-2000తేది నుండి 21-7-2000తేది వరకు వృషభంలో గురు, శనులు; మిధునంలో కుజ, బుధులు, రవి, 16తేది నుండి రవి కర్కాటకంలో ; కర్కాటకంలో శుక్ర, రాహువులు; మకరంలో కేతువు; ధనుర్మకర, కుంభాలలో చంద్రుడు.



## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

ఆదాయం పెరుగుతుంది. ఈ రాశి వారికి ఆర్థిక వృద్ధికి ప్రయత్నాలు చేస్తారు. ఉద్యోగ సమస్యలు, కుటుంబ సమస్యలు సర్దుకుంటాయి. ఆర్థిక వ్యవహారాల పేచీలు తాత్కాలికంగా రాజీకి వస్తాయి. కార్య సమర్థత బాగుంటుంది. అధికారుల, మిత్రుల సహకారం పొందుతారు. కొత్త ఉద్యోగావకాశాలు లభిస్తాయి. ఉద్యోగులకు స్థానమార్పు కలుగవచ్చును. రాజకీయ పలుకుబడి పెరుగుతుంది.



## వృషభం

(కృత్తిక 2,3,4 పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాల వారికి ఆదాయం పెరుగుతుంది. కాని ఖర్చులు కూడా పెరగడం, కుటుంబ సమస్యలు బాధించడం ఉంటుంది. కొన్ని ఆర్థికపరమైన నిర్ణయాలు తీసుకొంటారు. వస్త్ర వాహనాలు కొనే ప్రయత్నాలు జరగవచ్చును. గృహ రిపేర్లుంటాయి. ఉద్యోగపరమైన సమస్యలుంటాయి. కాని అధికారుల సహకారంతో గట్టెక్కుతారు. వ్యాపార పెట్టుబడులకు అవకాశాలు, కొత్త ఉద్యోగాలకు అవకాశాలు వస్తాయి.



## మిధునం

(మృగశిర 3,4 పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఉద్యోగ పనులు, సొంత పనులు విజయవంతంగా పూర్తి చేస్తారు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం పెరుగుదల ఉంటుంది. కాని కుటుంబ వ్యక్తులు ఖర్చును పెంచుతారు. కుటుంబ సభ్యులతో విభేదాలు రావచ్చును.

## కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

ఆర్థికపరమైన సమస్యలుండి కూడా అవసరాలకు డబ్బు అందుతుంది. బంధువర్గ వియోగవార్తలు వినవచ్చును. కుటుంబ సమస్యలు, ఉద్యోగ సమస్యలు మెల్లగా సర్దుకొంటాయి. ఉద్యోగులు అదనపు పనిభారంతో శ్రమపడతారు. అధికారులను గమనించుకొవాలి. అప్పుడప్పుడు బాగా మానసికాందోళన ఉంటుంది. ఉద్యోగులకు స్థానమార్పు ఉండవచ్చును. ఆకస్మిక ప్రయాణాలు తగులుతాయి. విద్యా ప్రగతి బాగుంటుంది. బంధుమిత్రుల రాకపోకలుంటాయి.

## సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

కుటుంబ వ్యక్తుల అనారోగ్య బాధలు, పనులు సరిగా జరుగక ఆందోళన ఉంటుంది. సన్నిహితుల వల్ల కొద్దిపాటి సమస్య రావచ్చును. పెట్టుబడులకు, ఇతరులకు తోడ్పడటానికి కొంత వ్యయం చేస్తారు. అదనపు భారమున్నా అధికారుల గుర్తింపు, గౌరవాలను ఉద్యోగులు పొందుతారు. సాంస్కృతిక, సాంకేతిక రంగాల వారికి కొత్త అవకాశాలు లభిస్తాయి. ఆందోళన కలిగించే వార్త వినడం జరుగుతుంది.

## కన్య

(ఉత్తర 2,3,4పాదాలు; హస్త; చిత్త 1,2పాదాలు)

కుటుంబంలో విభేదాలు ఏర్పడి సర్దుకుంటారు. వారాంతంలో ఆరోగ్యం కూడా సరిగా ఉండదు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాల వారికి ఆర్థికస్థితి బాగుంటుంది. రావనుకున్న బాకీలు కొద్దిగా లభించవచ్చును. బంధుమిత్రుల రాకపోకలుంటాయి. ఉద్యోగ మార్పు, నూతన ఉద్యోగావకాశాలు లభిస్తాయి.

### పంచాంగం

తేది 15 శనివారం శుక్రమౌఢ్యమి సమాప్తి, పశ్చాదుదిత శుక్ర. తేది 16 ఆదివారం కర్కాటక సూర్య సంక్రమణం. దక్షిణాయన పుణ్యకాలం. వ్యాస పూర్ణిమ.

**చంద్ర గ్రహణం**

తేది 16 ఆదివారం సాయంకాలం గం.5.27 నుండి ప్రారంభమై రాత్రి గంటలు 9.27ల వరకు కేతుగ్రస్తోదయ పూర్ణచంద్ర గ్రహణం. నేరుగా గ్రహణాన్ని చూడరాదు. ఆ రోజున పగలు దినకార్యక్రమాలు, పితృకర్మలు యధావిధిగా జరుపుకోవచ్చును.

**జూలై తిథులు**

**ఆషాఢ శుద్ధ**

తేది 15శని చతుర్దశి సా4.15గం.వ
తేది 16 ఆది పౌర్ణమి సా 6.10 గం.వ

**ఆషాఢ బహుళ**

తేది 17 సోమ పాడ్యమి రా 8.10 గం.వ
తేది 18 మంగళ విదియ రా9.54 గం.వ
తేది 19 బుధ తదియ రా 11.20 గం.వ
తేది 20 బేస్త చతుర్థి రా 12.45 గం.వ
తేది 21 శుక్ర పంచమి రా 12.50 గం.వ

**స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.**

## తుల

(చిత్ర 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

ఆర్థికాభివృద్ధికి ప్రయత్నాలు సాగిస్తారు. అనుకున్న పనులు సక్రమంగా జరుగుతాయి. ప్రభుత్వ సహకారం, ఆదేశాలు పొందుతారు. అధికారుల సహకారం బాగుంటుంది. ఇతరులకు ధన రూపంలో సహాయపడతారు. ఆదాయం బాగుంటుంది. సోదరులతో, బిడ్డలతో విభేదాలు రావచ్చును.

## వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఆర్థికస్థితి సామాన్యంగా ఉంటుంది. అవసరాలు ఏదో ఒక విధంగా తీరిపోతాయి. కుటుంబ సమస్యలు బాధిస్తాయి. అయితే నిర్ణయాలు స్వయంగా చేసి లబ్ధి పొందుతారు. ఆస్తి వ్యవహారాలు, ముఖ్య ప్రయత్నాలు వాయిదా వేస్తారు. రాజకీయ, సాంస్కృతిక రంగాల వారికి అంతమంచి సమయం కాదు. అధికారులను గమనించుకొని ఉద్యోగ బాధ్యతలు చేయవలసి వుంటుంది.

## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

ఆదాయం ఖర్చులు సమానంగా ఉంటాయి. కుటుంబ సభ్యులకు ఆరోగ్యం సరిగా లేకుండా రావచ్చును. చిరకాల ప్రయత్నాలు, పనులు అనుకూలం కాగలవు. రావలసిన బాకీలు, ప్రభుత్వ రుణాలు లభిస్తాయి. బంధువుల రాకపోకలుంటాయి. కళా, రాజకీయ, సాంస్కృతిక రంగాల వారికి ప్రోద్బలం, గుర్తింపు బాగుంటుంది. అనుకోని ప్రయాణాలు, సహచరులతో కొద్ది విభేదాలు.

## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

అనుకున్న పనులకు ఆటంకాలు, మీ మాటను లెక్క చేయక పోవడం వంటి సమస్యలుంటాయి. ఆదాయస్థితి, ఆర్థికస్థితి సామాన్యంగా ఉంటుంది. చుట్టు ఉన్న పరిస్థితులు మనోవేదనను కలిగిస్తాయి. కుటుంబ సభ్యులకు ఆరోగ్యం సరిగా ఉండదు. అవసరాలకు సహాయపడే మిత్రులుండటం మీ మంచితనం. అధికార బాధ్యతలు పెరిగినా అధికార వర్గంతో అనుకూలత మీకుంటుంది. శుభకార్య నిర్ణయ ప్రయత్నాలు చేయడం, కుటుంబ ఖర్చు ఉంటుంది.

## కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

కుటుంబంలో ఆరోగ్య పరిస్థితి బాగుండదు. దుబారా ఖర్చు, వైద్య ఖర్చు అధికం కావచ్చును. ఆదాయం సంతృప్తికరంగా ఉంటుంది. స్థిరాస్తులపై కొద్ది రాబడి ఉండవచ్చును. అధికారిక, అనధికారిక పనులు అనుకున్నట్లు జరుగుతాయి. ఉద్యోగులను బాగా గౌరవించినా, పనిభారం మైవేస్తారు. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది.

## మీనం

(పూర్వాభాద్ర 4 పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఆర్థిక రంగ పరిస్థితి బాగుంటుంది. అనవసర ఖర్చులు మీ చేత పెట్టిస్తారు. ఏపనైనా ఆటంకంతోగాని జరుగదు. ఆడంబరాలకు, హామీలకు పూనుకొనవద్దు. అధికార వర్గ సహకారం బాగుంటుంది. పని కూడా మీచేత బాగా చేయిస్తారు. సన్నిహితులతో, ఇతరులతో అభిప్రాయ భేదాలు రావచ్చును. వారం మధ్యలో ఆరోగ్యం బాగుండదు. సాంఘిక సేవా కార్యక్రమాలలో, శుభకార్యాలలో పాల్గొంటారు. విద్యా ప్రగతి బాగుంటుంది.

# జనవాణి

మూడవ పేజీ కోరవ

ప్రాంతాలుగా ప్రకటించి గెజిట్‌ను కూడా విడుదల చేసింది. మరి ఎక్కడ పొరపాటు జరిగిందో అర్థం కావడం లేదు. ఇప్పటికి జిల్లాలోని శాసనసభ్యులు జరిగిన తప్పు గ్రహించి సరిదిద్దించాల్సి వుంది.

నెల్లూరు/గునుపాటి రామచంద్రయ్య

## రాజకీయ పార్టీలకు బాధ్యత లేదా?

గుంటూరు మసీదులో బాంబు ప్రేలిన సంఘటనల్లో కాంగ్రెస్ పార్టీ ప్రమేయముందంటూ ముఖ్యమంత్రి, డిజిపిలు చేసిన ప్రకటనలను ఖండిస్తూ 'జమీన్‌రైతు'లో వచ్చిన సంపాదకీయం బాగుంది. సిఎం, డిజిపిలు సహేతుకమైన సాక్ష్యాలతో గూడిన వివరాలతో కాంగ్రెస్ పాత్రను నిరూపించితే బాగుండేది. అయితే నేటికి వచ్చిన విధంగా మాట్లాడడం మామూలై పోయిన ఈ రోజుల్లో ఆ విధంగా వూహించడం పొరపాటే కాగలదు. కాంగ్రెస్ నాయకులు ఆర్ఎస్ఎస్, విహెచ్‌పి తదితర సంస్థలకు బాంబు దాడులతో సంబంధముందంటూ అరచి గీ పెట్టారే, వీటికి ఏ ఆధారం వుంది. తమకు గిట్టని వారు కాబట్టి దొరికిన రాయి, రప్పతో కొట్టి తీరాలి. అదే విధానం, అదే సిద్ధాంతం - అదే సెక్యులరిజం అయిపోయింది. రాజకీయ పార్టీలు తమ ధోరణిని మార్చుకోకపోతే ప్రజల్లో చులకనై పోతారు.

నెల్లూరు కె.సత్యం

## కలెక్టర్‌కుసన్మానాలపిచ్చి

జిల్లా కలెక్టర్‌గా బదలీ అయిన శ్రీలక్ష్మికి సన్మానాల పిచ్చి పట్టుకొన్నట్లుంది. ప్రతిరోజూ ఒక్కొక్క ప్రభుత్వ శాఖ ఆమెను సన్మానిస్తున్నట్లు పత్రికల్లో వార్తలు వస్తున్నాయి. శ్రీలక్ష్మికి పత్రికల్లో ప్రచారంపై మక్కువ ఎక్కువున్నట్లుంది. గతంలో జిల్లా కలెక్టర్‌గా పని చేసిన జన్నత్‌హుసేన్ పరిపాలనాదక్షునిగా పేరు తెచ్చుకొన్నారు. వందల మందికి నిజాయితీగా ఉద్యోగాలిచ్చారు. రాజా అంతర్జాతీయంగా జిల్లా పేరు ప్రఖ్యాతులు ఇనుమడింప జేసిన అక్షరాస్యత, సారా వ్యతిరేక ఉద్యమాలకు పురుడు పోశారు. ఎం. సాంబశివరావు పొదుపులక్ష్మి ఉద్యమం ద్వారా జిల్లాకు ప్రత్యేక ఖ్యాతి తెచ్చారు. కాని వీరెవరూ శ్రీలక్ష్మిలా సన్మానాలు, ప్రచారానికి ప్రాకులాడలేదు.

నెల్లూరు వి.సుగుణ

## దర్గామిట్ట పేరు ఎవరు మార్చారు?

నెల్లూరులోని దర్గామిట్ట ప్రాంతాన్ని ఈ మధ్య కొందరు దుర్గామిట్టగా పేర్కొంటున్నారు. దర్గామిట్ట ప్రాంతం పేరు మునిసిపాలిటీ మార్చకపోయినా ఒక ప్రముఖ హాస్పిటల్ వారితో పాటు, పోస్టల్‌శాఖ స్టాంపుల్లో ఈ విధమైన ముద్రలు కనపడడం బాధాకరం. చారిత్రక ప్రాధాన్యతగల ప్రాంతాల పేర్లను ఎవరిష్టం ప్రకారం వాళ్లు మార్చుకొంటే ఎలా?

నెల్లూరు ఎం.ఎస్.వి.రావు

## నాయకుల నిర్లక్ష్యం - బిట్రగుంట నిరామయం

బ్రిటిష్ పాలకుల కాలం నుంచి రైల్వేలకు బిట్రగుంట ఎంతగానో పేరు గాంచి వారి చేత 'హౌస్ ఆఫ్ స్టీల్ హార్సెస్'గా కీర్తింపబడింది. అటువంటి రైల్వే బిట్రగుంట నేడు దయనీయస్థితిలో వుండడం బాధాకరం. రైల్వే అధికారులు చెప్పే కుంటి సాకు బొగ్గు ఇంజన్ల స్థానంలో విద్యుత్ ఇంజన్లు వచ్చాయని చెప్పడం. అంత మాత్రాన వందలాది రైల్వే క్వార్టర్లు, పాఠశాలలు, వైద్య శాలలు, ఆఫీసులను ముళ్ల చెట్ల మధ్య నిరామయం చేయడం తగదు. లేని పథకాలను సాధించుకొని రావడంలో మిగతా రాష్ట్రాల నాయకులు ప్రయత్నాలు చేస్తుంటే, మన రాష్ట్ర నాయకులు ఉన్నవి ఊడ్చుక పోతుంటే పట్టించుకోవడం లేదు.

మద్రాస్ ఎన్. రాంమోహన్‌రెడ్డి

## రిజర్వాయర్‌లోని ఒండ్రు మట్టి తీయాలి

ఈ మధ్య చెరువుల పూడిక తీత కార్యక్రమాన్ని ప్రభుత్వం చేపట్టింది. జిల్లాలో కనిగిరి రిజర్వాయర్‌లో 23 అడుగుల నీటిని నిల్వ చేసే సామర్థ్యముంది. కాని ఈ రిజర్వాయర్ పదడుగులపైనే పూడి పోయి వుంది. ఈ పూడిక మట్టి ఎంతో సారవంతమైన ఒండ్రుమట్టి. ఈ మట్టిని ప్రభుత్వం రైతులకు అందించగలిగితే ఎంతో మేలు జరుగుతుంది. కాని ఈ చెరువులో ఎప్పుడూ నీళ్లు వుంటాయి. నీళ్లు వున్నప్పటికీ ఆ మట్టిని బయట పోయగలిగిన 'డ్రెడ్జర్' అవసరం. ప్రభుత్వం దీన్ని ఏర్పాటు చేస్తే రైతులు ఈ మట్టిని తమ పొలాలకు వేసుకొని సారవంతం చేసుకొంటారు. ఈ విషయాన్ని ప్రభుత్వం పరిశీలిస్తే బాగుంటుంది.

లక్ష్మీపురం ఎం.సుబ్బారావు

## సిగ్గుచేటు

జిల్లాలో ఇప్పటి వరకు 70వేల మంది విద్యుత్‌ను అక్రమంగా వినియోగించుకొంటుంటే వేల రూపాయలు జీతాలుగా తీసుకొనే అధికారులు ఏం చేస్తుండినారు. బాధ్యతగా కరెంట్ బిల్లులు చెల్లించే వారిపైనే విద్యుత్ శాఖాధికారులు, ప్రభుత్వం రకరకాల వడ్డింపులు వేస్తూ హింసిస్తున్నారు. ఇది పద్ధతి కాదు.

నెల్లూరు టి.వినారాయణ

## యాభైఏళ్ల క్రితం

మూడవ పేజీ కొరవ

పండితులు. వీరు చేసిన సేవకు పౌరుల పక్షమున కృతజ్ఞత తెలుపుచున్నాము.

ఈ ఆసుపత్రి సజీవంగా, ప్రయోజనకరంగా వుండాలంటే మేము వెనుక సూచించినట్లు శ్రీనివాసాచార్యుల వారిని ఆనరరీ డాక్టరుగా తీసుకోవడం అత్యంత అవసరం. ఏమైనా ప్రజోపయోగ కార్యాలు చేయలేక పోతే కాంగ్రెస్ కౌన్సిల్ అని చెప్పుకోడానికి తాకతు యేమి వున్నదో చెప్పండి.

**చోరీ**

కొడవలూరు స్టేషనుకు పది బారల్లో వూరుమింగి వూరు పేర్ల గక్కగలిగిన సమర్థమైన నియోగి కరణం యింట్లోనే గత నెల 10తేది రు900లు చోరీ జరిగింది. పోలీసు సత్తా తీయలేక పోయింది - అని ఒక పెద్ద మనిషి అంటాడు. పోలీసు బోటీల్లోనే దొంగ తనం జరుగుతుంటే ఈ దినాల్లో పోలీసు స్టేషన్ ప్రక్కన వుండే ఆ కరణం ఇంట్లో చోరీ బోవడం వింతగాదు కాని పోలీసు పత్తా తీయలేక పోతున్న దనడం విమర్శించ దగింది.

- విమర్శకుడు

## పల్లెటూళ్లు

### సర్వేపల్లి మనమహోత్సవం

మా గ్రామ మునసబు కష్టపడి మూడు గంగిరాగి చెట్లు నాటాడు. కాని పాపం! అందులో ఒక చెట్టును ఎవరో పీకేశారు.

***

ఇద్దరు పెద్ద మనుషులు ఎరుకలవారి వద్ద దొంగ చాటుగా బంగారు గొలుసులనే మోజుతో గొలుసుకొన్నారు. చివరకు చూడబోతే అవి యిత్తడివని తేలింది. ఈ ఎరుకల వాళ్లు ఎవరైంది, ముందు ఏమి తతంగం జరిగింది నాకు తెలుసు. ఈ మోసపోయిన పెద్ద మనుష్యులు వారిని పట్టివ్వకుండా దొంగకు తేలుకుట్టినట్లు వూరుకొన్నారు. వీరు ఈ విధంగా వుండడం వల్ల ఎరుగని ఇతరులు గూడా మోసపోయేదానికి వీలుంది. పోలీస్ వెంటనే జోక్యం కలుగజేసుకొని తగిన చర్య జరుపవలెను.

***

స్కూల్లో స్వీపరులేడు. పిల్లలను పిలుచుకొని వచ్చుటకు మనిషిలేడు. ఉపాధ్యాయులే ఈ పని గూడా చేయవలసి రావడం వల్ల, నాలుగు గంటలు చెప్పవలసిన చదువు రెండు గంటలే సాగుచున్నది. విద్యాధికార్లు గమనించవలసిన అవసరం.

### ప్రజాస్వామికంలో విద్యావంతులకే నాయకత్వం

భవిష్యత్తులో ఆర్థిక సంపత్తి లెక్కకు రాదు. ఒక్క విద్యాబలమే పరిగణింప బడుతుంది. ప్రజాస్వామికంలో చదువుకొన్న వారిదే నాయకత్వం. అందువల్ల అందరు విద్యావంతులు కావలసిందిగా నా కోరిక అంటూ ఆర్థిక మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు, 12తేది ఉదయం నాయుడుపేటలో బోర్డు హైస్కూలును ప్రారంభించారు. ప్రారంభోత్సవ సభకు శ్రీవంగల్లు కోదండరామిరెడ్డి గారు అధ్యక్షత వహించిరి.

## నెల్లూరుసంగతులు

4వ పేజీ తరువాయి

కల్గేలా కృషి చేయాలన్నారు. బాలకార్మికుల వ్యవస్థను నిర్మూలించేందుకు చర్యలు చేపట్టాలన్నారు. ఈ నెల 15తేదిన జరగనున్న 22వ పచ్చదనం - పరిశుభ్రత కార్యక్రమంలో ప్రజల భాగస్వామ్యంలో విరివిగా మొక్కలను నాటి రాష్ట్రాన్ని హరితవనంగా తీర్చిదిద్దేందుకు కృషి చేయాలన్నారు. జిల్లా కలెక్టర్ శ్రీలక్ష్మి మాట్లాడుతూ సంపూర్ణ అక్షరాస్యతను సాధించేందుకు విస్తృతమైన చర్యలు చేపడుతున్నట్లు ముఖ్యమంత్రికి వివరించారు. సమావేశంలో జాయింట్ కలెక్టర్ డి.కార్తికేయల్, పంచాయతీరాజ్ ఎస్ఇ జనార్ధనరావు, ట్రాన్స్‌కో ఎస్ఇ కుమారస్వామి రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### జనాభా పెరుగుదలకు అందరూ అడ్డుకోవాలి

జనాభా పెరుగుదలను నియంత్రించేందుకు ప్రభుత్వం చేపడుతున్న అనేక పథకాల అమలులో ప్రజల సహకారం అవసరమని రాష్ట్ర సహకార శాఖ మంత్రి చిక్కాల రామచంద్రరావు అన్నారు. ప్రపంచ జనాభా దినోత్సవం సందర్భంగా కస్తూరిబా కళాక్షేత్రంలో జిల్లా వైద్య, ఆరోగ్య శాఖ, విద్యాశాఖల సంయుక్త నేతృత్వంలో జరిగిన సభలో ఆయన ముఖ్యఅతిథిగా పాల్గొని ప్రసంగించారు. భారతదేశ జనాభా వందకోట్లయ్యింది. రాష్ట్ర జనాభా ప్రస్తుతం ఏడున్నరకోట్లయ్యిందని, 2010 నాటికి ఈ సంఖ్య 10కోట్లకు చేరుకొంటుంది. జనాభా పెరుగుదలను అరికట్ట వల్సిన బాధ్యత ప్రతి ఒక్కరికీ ఉందన్నారు. జనాభా నియంత్రణకు రాష్ట్రంలో 8లక్షల కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలు జరగాలని లక్ష్యం నిర్ణయించగా, నెల్లూరు జిల్లా నిర్దేశించిన లక్ష్యాన్ని దాటి రాష్ట్రంలో మిగిలిన జిల్లాలకు ఆదర్శంగా నిలిచిందన్నారు. సభకు అధ్యక్షత వహించిన జాయింట్ కలెక్టర్ దాసరి కార్తికేయల్ మాట్లాడుతూ మహిళల సహకారం లేనిదే ఏ పథకం విజయవంతం కాదన్నారు. గూడూరు ఎమ్మెల్యే దుర్గాప్రసాద్, జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి మధుసూధన్ సింగ్, విద్యాధికారి ఎం.ప్రభాకరరెడ్డి, మునిసిపల్ కమీషనర్ వేమారెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### షిర్డిసాయి వైద్య శిబిరం విజయవంతం

నెల్లూరులోని షిర్డి సాయి రూరల్ వెల్ఫేర్ అండ్ మెడికల్ ఫౌండేషన్ నేతృత్వంలో 9తేది విఆర్ లా కాలేజి ఆవరణలో జరిగిన వైద్య శిబిరం విజయవంతమయ్యింది. శిబిరాన్ని రాపూరు ఎమ్మెల్యే ఆనం రామనారాయణరెడ్డి జ్యోతి వెలిగించి ప్రారంభించారు. అనంతరం మద్రాస్ విజయా హార్ట్ ఫౌండేషన్ డాక్టర్ అనిల్‌కుమార్, కోయంబత్తూరులోని కంటి డాక్టర్ జగదీష్‌కుమార్‌రెడ్డి తోపాటు మరో 40 మంది డాక్టర్లు 4,262 మంది రోగులను ఓపిగ్గా సాయంత్రం వరకు పరీక్షించారు. 2700 మంది కంటి రోగులు శిబిరానికి తరలిరాగా 150 మందికి ఆపరేషన్లు చేయడం అవసరమని గుర్తించారు. వీరిలో 105 మందికి డాక్టర్ జగదీష్‌కుమార్‌రెడ్డి నెల్లూరు అమెరికన్ ఆసుపత్రిలో 11తేది వరకు వుండి ఆపరేషన్లు చేశారు. షుగర్ వ్యాధిగ్రస్తులు 412 మంది, గర్భకోశ వ్యాధులకు సంబంధించి 950 మంది స్త్రీలకు, గుండె వ్యాధుల విభాగంలో 200 మంది పిల్లలకు, సాధారణ జబ్బుల విభాగంలో 300 మంది పిల్లలను పరీక్షించి ఉచితంగా మందులు పంచిపెట్టారు. శిబిర నిర్వహణ బాధ్యతలను నెల్లూరు ఎమ్మెల్యే వివేకానందరెడ్డి హాయిగా, ఫౌండేషన్ అధ్యక్ష, కార్యదర్శులు డాక్టర్లు సుందరరామిరెడ్డి, శ్రీధరరెడ్డి ఏర్పాట్లను పర్యవేక్షించారు.

### మహిళల రిలే నిరాహార దీక్షలు

పెంచిన విద్యుత్ ఛార్జీలను వ్యతిరేకిస్తూ అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఆధ్వర్యంలో 7తేది జోన్‌లోని పలు సెంటర్లలో మహిళలు రిలే నిరాహార దీక్షలు చేశారు. ఆత్మకూరు బస్టాండ్ వద్ద ఈ శిబిరాన్ని మహిళా సంఘం జిల్లా కార్యదర్శి రెహనా బేగం ప్రారంభించారు. గాంధీబొమ్మ వద్ద నిర్వహించిన శిబిరానికి మహిళా సంఘం జిల్లా కమిటీ సభ్యురాలు శెల్వీ, 9వవార్డు కౌన్సిలర్ లక్ష్మమ్మ నాయకత్వం వహించారు. మద్రాస్ బస్టాండ్ వద్ద జరిగిన శిబిరానికి మహిళా సంఘం పట్టణ కార్యదర్శి అరోల రమ్మ నేతృత్వం వహించారు. ఈ సందర్భంగా శిబిరాల వద్ద మహిళలు ఫ్యాన్లు, ట్యూబులైట్లతో పాటు, రోలు, రోకలి వంటి వస్తువులను ప్రదర్శించారు.

### మనోహర్ అభినందన సభ

బాల్ బ్యాడ్మింటన్ స్టార్ ఆఫ్ ఇండియా సెలక్షన్ కమిటీ సభ్యునిగా ఎన్నికైన తోట మనోహర్ అభినందన సభ జిల్లా ఫ్రీ థింకర్స్ అసోసియేషన్ 10తేది విఆర్ హైస్కూల్‌లో ఏర్పాటు చేసింది. ముఖ్యఅతిథిగా విచ్చేసిన రాపూరు ఎమ్మెల్యే ఆనం రామనారాయణరెడ్డి మాట్లాడుతూ స్వతహాగా వాలీబాల్, బ్యాడ్మింటన్, బాస్కెట్‌బాల్ క్రీడాకారుడైన మనోహర్ జిల్లాలో ఎన్నో క్రీడా సంఘాలకు వెన్నుదన్నుగా నిలిచి, స్ఫూర్తి కల్గించినట్లు చెప్పారు. జాతీయ స్థాయిలో అత్యుత్తమ ఆటగాళ్లను ఎంపిక చేసే బాధ్యత ఒక నెల్లూరీయుని చేతికి రావడం సామాన్య విషయం కాదన్నారు. ఫ్రీ థింకర్స్ అసోసియేషన్ తరపున మనోహర్‌ను డాక్టర్ పిట్టి ప్రసాద్ సన్మానించారు. ఈ కార్యక్రమంలో జిల్లా క్రీడాభివృద్ధి అధికారి ఆర్. సత్యనారాయణ, స్పోర్ట్స్ అథారిటీ రీజనల్ డైరెక్టర్ జగన్నాథరెడ్డి రాష్ట్ర బాస్కెట్‌బాల్ అసోసియేషన్ సంయుక్త కార్యదర్శి ఎ. రామూర్తి తదితరులు పాల్గొన్నారు.

### సాయిచందన వైద్య శిబిరం

బుద్ధిమాంద్యత గల పిల్లల కోసం నెల్లూరులోని సాయిచందన హాస్పిటల్ నిర్వహించిన వైద్య శిబిరం విజయవంతమయ్యింది. 8తేది ఏర్పాటు చేసిన ఈ శిబిరంలో 150 మంది పిల్లల్ని డాక్టర్లు పరీక్షించారు. ఈ సందర్భంగా ఆగష్టులో ఈ హాస్పిటల్ ప్రారంభించే 'సాయిసురక్ష డే కేర్ సెంటర్'లో చేరగోరే పిల్లల నుంచి దరఖాస్తులు స్వీకరించారు. శిబిరంలో డాక్టర్లు సురేష్‌బాబు, అనంతపద్మనాభరెడ్డి, జగన్‌మోహన్ రావు, రఘురామయ్య, రమణయ్య, మల్లికార్జునరెడ్డి, బి.వి.ప్రసాద్, పద్మజ, హరితతో పాటు చెన్నై సిబిఆర్ ప్రాజెక్ట్ కోఆర్డినేటర్ అనూరాధ నాయుడు కూడా పాల్గొన్నారు.

### జూనియర్ ఛాంబర్ మహిళల సాయం

నెల్లూరు టౌన్ జూనియర్ ఛాంబర్ మహిళా విభాగం జెసిరెట్ నేతృత్వంలో 10తేది చంద్రబాబు నగర్‌లో అగ్ని ప్రమాద బాధితులకు బట్టలు, బియ్యం పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో జెసిరెట్ ఛైర్‌పర్సన్ జ్యోతి, సెక్రటరి విజయ పాల్గొన్నారు.

## అయ్యోరు

4వ పేజీ తరువాయి

ఒక ఉద్యోగం కోసం 9 మంది పోటీ పడుతున్నారు. వాస్తవంగా జిల్లాలో 1,004 ఉపాధ్యాయుల పోస్టులు ఖాళీగా వున్నాయి. కానీ డిపెప్ పథకంలో పనిచేస్తున్న 147 మంది ఉపాధ్యాయులను ఖాళీల జాబితాలో పొందుపర్చక పోవడంతో 857 ఉపాధ్యాయ పోస్టులే భర్తీ చేస్తున్నారు. డిపెప్ పథకం కొనసాగు తుండడం వల్ల ఆ పథకంలో పనిచేస్తున్న ఉపాధ్యాయులు, తాము మామూలుగా పని చేసే స్కూళ్లలోని తమ పోస్టుల్లోకి తిరిగి వచ్చే అవకాశాలు తక్కువైనందు వల్ల ఈ పోస్టులు ఖాళీగానే వుండి పోనున్నాయి. నోటిఫికేషన్ ప్రకారం జడ్పీ, మండల పరిషత్‌లో 50, మునిసిపాలిటీలో 10 బియిడి పోస్టులు ఖాళీగా వున్నాయి. వీటిలో 15 లెక్కలు, 22 సైన్స్, 23 సోషల్ బోధించే ఉపాధ్యాయుల పోస్టులున్నాయి. జడ్పీ, మండల పరిషత్తులలో 515 తెలుగు, 25 ఉర్దూ; మునిసిపాలిటీలో 109 తెలుగు, 16 ఉర్దూ సెకండరీ గ్రేడ్ పోస్టులు ఖాళీగా వున్నాయి. ఇదిగాక భాషా పండితుల పోస్టులు 102, పిఇటి పోస్టులు 30 ఖాళీగా వున్నాయి. మొత్తం మీద టిటిసిలో గానీ, బియిడిలోగాని సోషల్ సైన్స్ పాఠ్యాంశంగా పరీక్ష పాసై వున్న విద్యార్థులు కేవలం 647 పోస్టులకు మాత్రమే పోటీ పడాల్సి వుంది. ఈ గ్రూపులో చదివిన వారే ఎక్కువ వుండడం వల్ల ఇక్కడ పోటీ మరింత తీవ్రమయ్యే అవకాశాలున్నాయి. ఎంప్లాయిమెంట్ కార్యాలయంలో నమోదైన 5091 మంది బియిడి అర్హత కల్గిన వారిలో ఎస్సీలు 573, ఎస్టీలు 19 మంది, బిసిలు 1728 మంది, స్త్రీలు 1880 మంది పోను ఇతర వర్గాల వారు 1392 మంది వున్నారు. టిటిసి పరీక్ష పాసైన 1,980 మందిలో ఎస్సీలు 213 మంది, ఎస్టీలు 23 మంది, బిసిలు 349 మంది, మహిళలు 574 మంది, ఇతర వర్గాల వారు 1,021 మంది వున్నారు.

ఎంపిక కోసం 85మార్కులకు ఒక పరీక్షను జనరల్ నాలెడ్జి, ఎడ్యుకేషన్ సైకాలజీ, మెథలాడజి, స్కూల్ సబ్జెక్ట్స్‌ల్లో నిర్వహిస్తారు. మిగతా 15 మార్కులకు గాను ప్రకటించిన వెయిటేజీ గ్రామీణ ప్రాంత నిరుద్యోగుల పాలిట శాపంగా మారింది. ఇంటర్, డిగ్రీలలో పొందిన మార్కులకు గాను 5 మార్కులు, టిటిసి, బియిడిలలో పొందిన మార్కులకు గాను 5మార్కులు, నిరుద్యోగిత కాలానికై 3 మార్కులు వెయిటేజీగా ప్రకటించారు. గ్రామీణ ప్రాంత విద్యార్థుల చదువు ఇంటర్, డిగ్రీలలో అంతంత మాత్రంగానే వుంటుంది. టౌన్లలో చదువుకొనే విద్యార్థులు ఈ పరీక్షల్లో ఎక్కువ మార్కులు తెచ్చుకొంటారు. దీనికితోడు విద్యా వాలంటీర్లకు ప్రకటించిన 2 మార్కులు, వివాదాస్పద మవుతున్నాయి. విద్యావాలంటీర్ల సర్టిఫికెట్ దొంగదారిలో పొందే వీలున్నందున అక్రమార్కులు లబ్ధిపొందే అవకాశం ఎక్కువగా వుంది. ఈ పరీక్షకు కష్టపడి చదివి వ్రాసి ఉపాధ్యాయుడిగా నియామక పత్రం అందుకొన్నా నాలుగేళ్లపాటు అప్రెంటిస్‌గా 1200 రూపాయల జీతానికి పనిచేయాల్సి రావడం నిరుద్యోగులను, విరుద్యోగులను చేసి ప్రభుత్వం వెట్టి చాకిరీ చేయించడమేననాలి.

## మంచిజిల్లా

4వ పేజీ తరువాయి

మీకే తెలుసునని పత్రికా భాషలో చమత్కరించారాయన. జాయింట్ కలెక్టర్ కార్తికేయల్, డిఆర్వో వెంకటేశ్వర్లు కలెక్టర్‌కు వచ్చిన సందేహాలకు సమాధానాలిచ్చారు.

బాల్ బ్యాడ్మింటన్ స్టార్ ఆఫ్ ఇండియా సెలక్షన్ కమిటీ సభ్యునిగా ఎన్నికైన తోట మనోహర్‌ను సత్కరిస్తున్న రాపూరు ఎమ్మెల్యే రామనారాయణరెడ్డి, డాక్టర్ పిట్టి ప్రసాద్, ప్రక్కన క్రీడాభివృద్ధి అధికారి సత్యనారాయణ.

## చిత్రసమీక్ష

9వ పేజీ తరువాయి

తన తండ్రి చనిపోవటంతో తాను దుఃఖసాగరంలో మునిగివున్నందున ఆ ప్రాంతంలో వున్న వారెవ్వరూ దీపావళి పండుగ జరిపి ఆనందంగా వుండకూడదని బడా రౌడీ అయిన రామిరెడ్డి శాసిస్తాడు. అతని దుర్మార్గానికి భయపడి ఎవ్వరూ దీపావళి జరుపరు. ఒక పోలీస్ ఆఫీసర్ (చరణ్‌రాజ్) ముందుకొచ్చి అచ్చటి ప్రజలకు ధైర్యం చెప్పి దీపావళి పండుగ జరుపుకోమని చెప్తాడు. ధైర్యం చాలని ప్రజలు దీపావళి జరుపరు. పోలీస్ ఆఫీసర్ తన భార్య చేత (విజయశాంతి) దీపాలు వెలిగిస్తాడు. అప్పుడు ధైర్యం పుంజుకున్న ప్రజలు దీపావళి జరుపుకుంటారు. అది తెలిసిన రౌడీ రామిరెడ్డి రెచ్చిపోయి అచ్చట నానా భీభత్సం సృష్టిస్తాడు. పోలీస్ ఆఫీసర్‌ను పాడి మీద పండపెట్టి శవపూజ చేయిస్తాడు. అది సహించని అతని భార్య, రామిరెడ్డి దుర్మార్గాన్ని ఎదిరిస్తుంది. అతని ముఠాను హతమారుస్తుంది. తీరా చూస్తే ఆమె చుక్కమ్మ. అభాగ్యుల జీవితాలకు వెలుగును ప్రసాదించి ఆమె "అడవిచుక్క"గా ప్రజ్వలిస్తుంది.

అడవి తల్లిని నమ్ముకొని అమాయకంగా బ్రతుకులు ఈడుస్తున్న గిరిజనులు, భూస్వాముల దుర్మార్గాలకు బలైపోతున్న విధానాన్ని, కథకుడు, దర్శకుడు అయిన దాసరి నారాయణరావు హృదయాన్ని తాకే రీతిలో చూపాడు. గిరిజనుల్లో పాతుకపోయిన అమాయకతను పారద్రోలి, చైతన్య బీజాలు నాటితే, అన్యాయాన్ని, అక్రమాన్ని ఎదిరించి వారు స్వేచ్ఛా సుఖజీవనం పొందగలరన్న ప్రయోజనకరమైన మార్గాన్ని చూపాడు. మంచి మలుపులతో చిత్రాన్ని యావత్తు పటుత్వంగా మలిచాడు.

సంజీవి మాటలు, అశోక్‌తేజ పాటలు, వందేమాతరం శ్రీనివాస్ సంగీతం చిత్రానికి అదనపు బలం కూర్చాయి. విజయశాంతి చిత్రమంతా తానేగా, తనదే చిత్రంగా అడుగడుగునా విజృంభించి అద్భుతంగా నటించింది. చిత్రానికి ప్రాణమైంది. చరణ్‌రాజ్, సుమన్ గిరిజనుల్లా ఉత్తేజం రేకెత్తించేందుకు ఉపయోగపడ్డారు. రామిరెడ్డి, జయప్రకాష్‌రెడ్డి దుర్మార్గాల భీభత్సం భయంకరంగా వుంది.

### పొలాలనన్నీ....

**- తిరుమూరు సుధాకర్‌రెడ్డి**

ఆకుపచ్చ విప్లవం ఆకర్షణ కోల్పోయిన
చోట
ఆశల గాలలతో సాగుతోంది కాసులవేట

పొలాలను జలాశయాలుచేసి
ధనం పంటకు ఎతమెత్తుతోంది
పల్లెజనం
ఇప్పుడు ఊరుచుట్టూ ఉప్పునీటి
గలగలలు
ఊళ్లో మంచినీటికి విలవిలలు!
నాగళ్లతో దున్నిననాడు
నవధాన్యాలను గంపకెత్తావు
ట్రాక్టర్లతో తొక్కించిననాడు
విలువైన ఫలసరుకులిచ్చావు
ఇప్పుడు పొక్లెయిన్లతో నీ పేగులు
లాగేస్తుంటే
ఇంకా ఏమిస్తావో బహుమతి?
వైరినా వసుమతి!
వినాయకుడి బొడ్డులో వేలుపెట్టి
తేలుకుట్టినా నవ్వేసిన బాలుడి చందం-
మలభనిరతై రైతన్నల వరుగువందెం!
పల్లెకు పట్నానికి మధ్య
రెపరెపలాడుతున్న
పల్లెటి పొర కరిగిపోతోంది-
కరెన్సీ కల్పర్లో!
చేపా చేపా ఎందలేదేమి అన్నది నిన్నటి
కథ!
రొయ్యా! రొయ్యా! డాలర్లు పండలేదేమి
అన్నది రేపటి వ్యథ!!

## సినిమా

9వ పేజీ తరువాయి

దేవత పాత్ర పోషించాలనే కోరిక మదిలో దాగుంది. కాని తగ్గ అవకాశాలు రాలేదు. దీంతో ఆమె భక్తిరస చిత్రాలను మాత్రమే తీసే దర్శకులు రామనారాయణ దగ్గరకు వెళ్లి అతని ముందు తన కోరికను వుంచింది. నా సినిమాలన్నీ చిన్న బడ్జెట్ సినిమాలు, నువ్వు తీసుకొనే పారితోషికం ఇవ్వలేనని రామనారాయణ స్పష్టం చేశారట. మీనానే దిగివచ్చి మీరిచ్చేది ఇవ్వండని, కేవలం నాలుగు లక్షల రూపాయలు తీసుకొని పాళయత్తమ్మన్ పాత్రను పోషిస్తుంది. ఈ వేషం కోసం ఆమె మూడు గంటల పాటు మేకప్ చేయించుకొంటుంది. షూటింగుల్లో దేవతగా ఒక్కోసారి రోజంతా అలసట లేకుండా కూర్చొంటుంది. ఛాలెంజ్‌గా తీసుకొని ఈ క్యారక్టర్ను చేస్తున్నానంటున్న మీనా, ఈ చిత్రం పూర్తయ్యే వరకు తనకు ఇష్టమైన మాంసాహారాన్ని మానివేసి శాఖాహారాన్ని తింటుంది.

# సణుగుడు

2వ పేజీ కొరవ

కొన్ని వేల మంది పేద హరిజనుల పేరు పెట్టి పిలవగలిగిన పరిచయం వుండేది ఆయనకు. ఈ విస్తృత చైతన్య యాత్రలు, మద్యపాన నిషేధ ఉద్యమానికి దారి తీశాయి. ప్రపంచ వ్యాప్తంగా నెల్లూరు జిల్లా మహిళలకు పేరు తెచ్చి, ప్రభుత్వాన్ని గడ గడ లాడించిన సారా నిషేధ ఉద్యమానికి రూప కల్పి, నిర్వాహకుడు రాజా గారే నన్నది నిజం. కలెక్టర్‌గా ఎక్కడా తన పరిధి అతిక్రమించకుండా, తన పేరు బయటకి రాకుండా, వివాదాలలో ఇరుక్కోకుండా ఇంత పెద్ద ఉద్యమాన్ని నడిపించారు రాజా గారు. ఒక సంఘ సంస్కర్త తన జీవిత కాలంలో చేయలేని పని, మూడేళ్ల స్వల్ప కాలంలో చేశారు. రాజా నిశ్శబ్దంగా చేసిన కృషి, సాధించిన విజయాలు ఆయన సజీవంగా వున్నప్పుడే కాదు, ఆ తర్వాత కూడా సామాజిక శాస్త్ర పరిశోధకులు, భవిష్యత్ చరిత్రకారులు గుర్తు పెట్టుకుంటారు.

పార్థసారధి, జన్నత్‌హుస్సేన్, సుజాతరావు వంటి కలెక్టర్లు కూడా నెల్లూరు జిల్లా జన జీవితంపై తమ ప్రభావం చూపివెళ్లారు. హెచ్.కె.బాబు కలెక్టర్‌గా వివాదాస్పదుడైనప్పటికీ, డిఆర్వోగా ఆయన విధి నిర్వహణా తీరు ఆనాటి వారికందరికీ జ్ఞాపకమే. ఇప్పుడు నెల్లూరు నుంచి వెళ్తున్న కలెక్టర్ శ్రీలక్ష్మి గారు పిల్లల పార్కు నిర్మించడం ద్వారా తన గుర్తు వదలి వెళ్తున్నారు.

నెల్లూరు ఒక జిల్లాగా ఏర్పడి, కలెక్టర్ల నియామకం ప్రారంభమై 2001 నాటికి రెండు వందల ఏళ్లయ్యింది. ఇటువంటి చారిత్రాత్మక సమయంలో 85వ కలెక్టర్‌గా ప్రవీణ్‌కుమార్ ఛార్జి తీసుకొన్నారు. అది ఆయన అదృష్టం. ఆయన ఇక్కడ వున్నప్పుడే నెల్లూరు ద్విశతాబ్ది ఉత్సవాలు జరగబోతున్నాయి. రాష్ట్రంలో ఈ అదృష్టం కలిగిన జిల్లాల సంఖ్య చాలా కొద్ది. బహుశా కృష్ణాజిల్లా ఒక్కటే ఇంత సుదీర్ఘ చరిత్ర కలిగి వుంటుందను కొంటాను. తెలంగాణా కూడా నిజాం పరిపాలనలో వుండడం వల్ల హైదరాబాదుకు కూడా కలెక్టర్ల చరిత్ర లేదు. ఆర్కాట్ నవాబు నుంచి మద్రాసు స్వాధీనమైనప్పుడు నెల్లూరు కూడా బ్రిటిష్ పరం కావడం వల్ల, రాష్ట్రంలోని తతిమా జిల్లాల కంటే ముందుగా నెల్లూరుకు కలెక్టర్‌ను నియమించింది బ్రిటిష్ ప్రభుత్వం.

ప్రవీణ్ కుమార్ యువకుడు; ఆయనకు బంధుత్వాల రీత్యా అధికార వర్గాలలో మద్దతు వుంటుంది, చిన్ననాటి నుంచి ఉన్నతాధికారులతో, వారి వ్యవహార ధోరణితో పరిచయం వుంది. ఆయన తండ్రి పోలీస్ అధికారి, పిల్లనిచ్చిన మామ ఐఎఎస్ అధికారి. ఈ నేపథ్యం నుంచి వచ్చిన వారు కాబట్టి తను చేయదలచుకున్న పనులు చేయడానికి అడ్డంకులేమీ వుండవు.

అయితే ఇప్పుడు కలెక్టర్ వుద్యోగం ఇదివరకటి వలె హోదా కల్పించే పోస్ట్ కాదు; అది కత్తి మీద సాము వంటిది. ప్రభుత్వం కలెక్టర్ల పైన చాలా పెద్ద బాధ్యతలు పెట్టింది. దాదాపు నూటయాభై సంస్థలు, విభాగాలు కలెక్టర్ అజమాయిషీలో వుంటాయి. చంద్రబాబు వచ్చిన తర్వాత కలెక్టర్ల పుణ్యకాలం సమావేశాలతో, వీడియో కాన్ఫరెన్సులతో గడిచి పోతున్నది. వారు జిల్లాలో, గ్రామాలలో తిరిగి, ప్రజలతో కలిసిపోయే అవకాశం తగ్గిపోయింది. ఆఫీసులో టేబులుకు, చెత్త ఫైళ్లకు అతుక్కుపోయి పని చేసే గుమస్తాలకు, కలెక్టర్లకు పెద్ద తేడా లేదిప్పుడు. ఇంకొక ప్రక్క రాజకీయ వత్తిడిలు పెరిగిపోయాయి. తెలుగు దేశం ఎమ్మెల్యేలు అధికారులపైన స్వారీ చేస్తున్నారు. ఎమ్మెల్యే మాట కాదంటే, ముఖ్యమంత్రి నుంచి చీవాట్లు వస్తున్నాయి. ఇన్ని పరిమితులు, నిర్బంధాలు, ఒత్తిడులతో పని చేయడం అంటే, నిజంగా కత్తి మీద సాము వంటిదే. ఈ మధ్య మన కలెక్టర్‌గా వుండిన డాక్టర్ సాంబశివరావు వలె వ్యవహరించ గలిగితే, ఏ పేచీ లేదు; ఆయన తామరాకు మీద నీటిబొట్టు వంటి వారు; ఏదీ పట్టించుకునే వారు కాదు, ఎవర్నీ నొప్పించే వారు కాదు.

కొత్త కలెక్టర్ ఈ నిరపాయకర మార్గం ఎంచుకుంటాడో, శంకరన్, రాజా వంటి వారి వలె తన ముద్ర నెల్లూరు మీద వేసి వెళ్తాడో చూద్దాం.

***

కరెంట్ ఛార్జీల విషయంలో రాష్ట్రమంతా ఎంత రచ్చ రేగుతున్నదో ప్రత్యేకంగా చెప్పపని లేదు. గొర్రె తోక జీతంతో బ్రతికేవాడినుంచి, లక్షల్లో వ్యాపారం చేసే గొప్పవాడి వరకు ప్రతి ఒక్కరూ కరెంట్ ఛార్జీల గురించే మాట్లాడుతున్నారు. నూటికి తొంభై మంది వాదన చంద్రబాబు చేసింది తప్పు అని. కాని నాకు మొన్నొక రోజు కడప పట్టణంలో ఒక ఆటో డ్రైవర్ తటస్థపడ్డాడు. కరెంట్ ఛార్జీల పెంపకం ఎంత సమంజసమో అతడి నోటి నుంచి వింటే ఆశ్చర్యం కల్గింది. చదువు, సంధ్య లేని పేద ముస్లిం యువకుడు అతడు; ఆటో తోలడమే జీవనాధారం; అది కూడా అతడి స్వంతం కాదు; అంత నిరుపేద, నిరక్షరాస్య నేపథ్యంలో బ్రతుకుతున్న ఆ ఆటో డ్రైవర్ చంద్రబాబు నాయుడు చేసిన పని ప్రజా సంక్షేమం కోసమేనని ఎంత గొప్పగా వివరించాడో చెప్పలేను. మేధావులు, పార్టీ అభిమానులు, చదువుకున్నవారు ఇటువంటి విషయాలు మాట్లాడడం వేరు; పొట్ట పొడిస్తే అక్షరం ముక్క రాని, నిద్ర లేస్తే పొట్టపట్టుకుని పని చేసుకునే వారు మాట్లాడడం వేరు.

"మా వూర్లో ఇదివరకు రోడ్లు పరమ చండాలంగా వుండేవి; మెయిన్ రోడ్లో ఆటో తోలాలంటే ప్రాణానికి వచ్చేది; ఇప్పుడు ప్రతి సందులోనూ సిమెంట్ రోడ్లే; పది ఇళ్లు వున్న దగ్గర కూడా రోడ్ వేశారు; చంద్రబాబు వచ్చిన తర్వాత ముసలి వాళ్లకు పూట గడవడానికి నెల, నెలా రెండు వందల రూపాయలు ఇస్తున్నాడు; కడుపుతో వున్న ఆడవాళ్లకు డబ్బు ఇస్తున్నాడు; పేదవాళ్లకు సైకిలు, పాలక్యాన్లు, కుట్టు మిషన్లు వంటివి పంచిపెడుతున్నాడు; ఇవన్నీ చేయాలంటే గవర్నమెంటుకైనా డబ్బు కావాలి కదా; ఇది వరకు ఏమీ చేసే వారు కాదు; కాని ధరలు పెరుగుతూనే వుండేవి, ఇప్పుడు ఎంతో కొంత గవర్నమెంట్ చేసే పని కనపడుతున్నది; ఈ ఆటో తోలాలంటే ఎన్ని ఇబ్బందులు వున్నాయో నాకు తెలుసు; పది రూపాయలు ఇచ్చి దిగిపోయే వారికి మీకు నా బాధలు చెప్పినా అర్థం కావు; అట్నే గవర్నమెంటు నడపడానికి ఎన్ని కష్టాలు వున్నాయో బయట వుండేవారికి మనకేమి తెలుస్తుంది? కరెంటు ఛార్జీలు పెంచడమంటే అందుకేదో కారణం వుంటుంది; ధరలు పెంచకుంటే గవర్నమెంటుకు డబ్బు ఎట్లా వస్తుందో మీరే చెప్పండి" అన్నాడు ఆ ఆటో డ్రైవర్.

రాష్ట్రంలోనే కాదు, దేశంలోని రాజకీయవాదులందరూ చంద్రబాబు నుంచి నేర్చుకోవాల్సింది చాలా వుంది. తాను పని చేసినా, చేయకున్నా; అది జనానికి వుపయోగపడేది అయినా కాకపోయినా, తను చేసే పనికి ఆయన జరిపించే ప్రచారం ఎంత లోతుకు వెళ్లిందో ఈ సంభాషణ బట్టి అర్థం చేసుకోవచ్చు.

కాంగ్రెస్ ప్రభుత్వాలు నాగార్జునసాగర్, శ్రీశైలం వంటి ప్రాజెక్టులు కట్టాయి; విద్యుత్ కర్మాగారాలు నిర్మించాయి; విశాఖపట్నం స్టీల్ ప్రాజెక్టులు స్థాపించాయి; కరువు వస్తే గంజి కేంద్రాలు నడపవలసిన పరిస్థితి నుంచి పేద వ్యవసాయ కూలీలు ఏడాది పొడుగునా చేసినంత పని కల్పించాయి ఈ ప్రాజెక్టులు. కాలి నడకన, ఎడ్ల బండ్లలో తిరుగుతుండిన జనం ఆటో ఎక్కే ఆర్థిక స్థోమత కల్పించాయి; కాని అవి గ్రామాలలో పట్టణాల్లో కనిపించేవి కావు; చంద్రబాబు వేయించిన సిమెంటు రోడ్లు మాత్రం మనం వద్దు అనుకున్నా కనిపించి తీరుతాయి. సిమెంట్ రోడ్ల వల్ల ప్రజల జీవన ప్రమాణం పెరుగుతున్నదా, ప్రజలకు వాటి వల్ల ఒక పూట అదనపు పని, ఒక పైసా అదనపు రాబడి వస్తుందా అన్నది మేధావులు వేసుకొనే ప్రశ్న. సగటు మనిషికి అంత దూరం ఆలోచించే అవకాశం వుండదు. వారికి చంద్రబాబు చేస్తున్న పనులు మాత్రం కనపడుతున్నాయి. వాటిని జనం మరిచి పోకుండా ప్రతిరోజూ పత్రికలలో, టివిలలో ఆయన పదే పదే జ్ఞాపకం చేస్తున్నారు. చంద్రబాబు ప్రచార యజ్ఞం సామాన్య ప్రజానీకాన్ని ఎంతగా హిప్నటైజ్ చేసిందీ తెలుసుకోవడానికి ఈ ఆటో డ్రైవర్ ఒక ఉదాహరణ. హాట్స్ ఆఫ్ టు చంద్రబాబు.*



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354, Offset Printing at Zamin Ryot Press, Nellore.